హారంబులు నంగుళీయాదిరాజార్హ భూష । లెలమి నపరంజి
పుల... ములును గిండ్లు । పెట్టెలకొలంది జాళెలు మట్టుమీఱ
నట్టి......నుమగర లాత్మఘనత । కనుగుణంబుగ దయచేసి
యుపుడు మఱియు॥ క. కేళాకూళులుసజ్జలు। కేళీవనములునుమిం
చుగృహారాజంబుల్।శ్రీలెసఁగనొసఁగిలోకులు। మేలనికొనియాడఁ
గరుణ మీఱఁగ నంతన్॥ ఉ॥ ఎంతటిభాగ్యశాలి యితఁ డెంత
టిధన్యుఁ డటంచు నెంచిశు । ద్ధాంతమునందుఁ బాండ్యవసుధా
ధిపనందన లాదిగనైనయాం।కాంతలు గోల్వ నన్ను సముఖంబునఁ
గన్నులఁ గప్పకొంచున । త్యంతబహూకృతుల్ సలుపునవ్విభు
వంశము సన్నుతించెదన్॥

రంగాజమ్మ రచించినఉషాపరిణయమున :—

“ మఱియును......దానరాధేయుండును......రాజగో
పాలనిత్యకైంకర్యధుర్యుండును, చతుర్వేదశతక్రతు శ్రీనివాసా
చార్యచరణసరసిజసేవానిష్ఠాగరిష్ఠుండును, ......రఘునాథనృ
పాలనందనుండును, రచితకళావత్యంబికానయనానందుండును న
గునవ్విజయరాఘవేంద్రుండు రామణీయకవిరచితరాజరాజసభా
విజయంబగు రాజగోపాలవిజయంబునందు నతులితవిలాసవతు
లైన కులసతులును, విబుధసన్నుతమతియగు విజయవేంకట
పతియును,మహితప్రభావుండగుమన్నారుదేవుండును,తతయశో
ఘనుండగు తాతఘనుండును, రంగదృశోవిలాసుండగు చెంగమల
దాసుండును మొదలగు నిఖిలజనమితులయిన పుత్త్రులును, ని

రుపమచరిత్రపవిత్రులయిన పౌత్త్రులును, నిరవద్యరూపరేఖాకన
కపుత్త్రికలయిన పుత్త్రికలును నింపువెలయఁ దామరతంప
రై నిండియుండఁ జెంగట శృంగారవతులు రంగురక్తులు మీాఅ
సంగీతమేళంబు గావింప నగ్రభాగంబున నాచార్యాగ్రేసరుం
డగుశతకత్రితుశ్రీనివాసాచార్యుంను కృతదురితభంగంబగుహరి
వంశకథాపత్రిసంగంబు గావింప నింపుమీాఱ,నేనును శృంగారరసం
బు చెన్నుమీాఱుమన్నారుదాసవిలాసంబు వినిపించుమన్న సమ
యంబున. సీ॥ వేంకటేంద్రునిపుత్త్రి వినుతసద్గుణధాత్రి ఘన
యశోరాజి రంగాజి వినుము। మాధుర్యమున మించుమన్నా
రుదాసవిలాసప్రబంధంబు లలితఫణితిఁ। గావించి మిగుల శృం
గారంబు గన్పట్టఁ బదములు మృదురసాస్పదము లగుచు। రాణిం
ప రచియించి రామాయణంబును భాగవతంబును భారతంబు॥
గీ॥ సంగ్రహంబుగ రచియించి సరసరీతి। మమ్ము మెప్పించితివి
చాల నెమ్మి దనర।బరఁగ హరివంశమున నుషాపరిణయకథ। తెనుఁ
గుఁ గావింపు మిఁక నీవు తేట గాఁగ” అని సబహుమానంబుగాఁ
దాంబూలజాంబూనదాంబరమాల్యాభరణాబు లొసంగిన నే
నును బరమానందంబుం జెందుచుఁ బతియును,గతియును, కుల
దైవంబు నయిననీదుపాదారవిందంబులు డెందంబున సేవించుచు
న్న తనకు మీా రానతిచ్చుకథాసంవిధానంబు సర్వంబును న
వగతంబగుఁ గావున నట్ల రచియించెదఁ బంజరశుకంబు మంజువా
గ్భణితి రంజిల్లం బలికినం దత్ప్రేషకుండు సంతోషించు తెఱంగున

మదీయవచనకుసుమార్చనం బంగీకరించి నన్నుం గటాక్షింపుం
డని విన్నవించిన లాలించి యాచార్యచరణంబులకు వందనంబు
గావించి యమ్మహామహునియనుజ్ఞ గైకొమ్మనుటయు నట్లన
సేవించిన దీవించి గురురాజపట్టభద్రుం డిట్లనియె.

క. నీపతి మన్నరుదాసుండు। గోపాలుండు గనుక నితండు కో
ర్కులు వెచ్చం। జేపట్టి మనుప నెలకొను। నాపలుకుల నెలంత
నీముఖాంబుజసీమన్ ॥ సీ॥ తనరెడు మన్నారుదాసవిలాసంబు న
మర నీ వొనరించునప్పు డేను। విజయరాఘవమహీవిభుని నంశా
వళి వినిపించితిమి గదా విశదముగను... మన్నారుదాస విలాస
మున:—కం॥ చతురాస్యుండవండగునని। పతియిటునినుగా నపించి
బహుమతిదోంపన్। కృతిరచియింపుమనెన్ భా। రతికిం బ్రతి
వత్తువమ్మ రంగాజమ్మా॥ సీ॥ నావిభుండైన మన్నారుదాసుని
చేత (విజయరాఘవుండే) ముదమున మంజరీముఖ్యకృతులు।
పొగడ్తాంద నంకితంబుగాంగాంచు శ్రీరాజగోపాలశౌరికిం గోర్క
మీఱు। నే సంకితము సేయునిటువంటి మన్నారుదాసవిలాసంబు ధ
రణిలోనం। బరమభాగవతునిచరితంబు గావున వినినవారినినం
జదివినజనులకు॥ గీ॥ నాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి। ధన
కనకముఖ్యవస్తు వాహనసమృద్ధి। నిరుపమానకవిత్వ పాం
డిత్య మహిమ। కలుగు నాచంద్ర రవితారకంబుగాంగ॥

ఈవిద్వాంసురాలిగద్య :—

ఇది శ్రీరాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన

పారసారస్వతధురీణయు, విచిత్రతరపత్రికాశతలిఖిత వాచికార్థావ
గాహనప్రవీణయుఁ, దత్ప్రతిపత్రికా శతస్వహస్తలేఖనప్రశస్త
కీర్తియు, శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతి స్ఫూర్తి
యు, నతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారదయు,
రాజనీతివిద్యావిశారదయు, విజయరాఘవమహీపాలవిరచితకన
కాభిషేకయు, విద్వత్కవిజనస్తవనీయవివేకయు, మన్నారుదాస
విలాసనామక మహాప్రబంధనిబంధనకృతలక్షణయు, మహనీయ
రామాయణభాగవతభారతకథాసంగ్రహణవిచక్షణయుఁ, బస
పులేటివేంకటాద్రిబహుజన్మతపఃఫలంబును, మంగమాంబాగర్భ
శుక్తిముక్తాఫలంబును, రంగద్గుణకదంబయు నగు రంగాజమ్మ
యొనరచనాచమత్కృతిం జెన్ను మీఱు నుషాపరిణయం బను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

*ఈమహారాజు సదా కాలము వేశ్యలతో సంతోషిస్తూ వుం
డగా, పతివ్రతలయిన పట్టపురాణి, వేశ్యను నిందిస్తూ దాసిద్వా
రా యేమో కబురంపిందట, విద్వాంసురాలైన (రంగాజో, కృ
ష్ణాజో, ఎవరో!) ఆ వేశ్య ఈపద్యము రచించి తిరిగి పంపినదట:—

ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో తమ రాఁజువారుగా
రో వలపించునేర్పెఱుఁగరో తమకౌఁగిటిలోన నుండఁగా

---

* ఈసందర్భం పొరబాటున పూసపాటి విజయరామరాజుగారిదిగా "చాటుపద్యమణిమంజరి" లో వ్రాసినాను. కాదు, ఈవిజయరాఘవనాయ కునిగూర్చినదే! ఇంకాకొన్ని పద్యములు ఈమహారాజుమీఁదివి అందులో వున్నవి చూడండి!.

రావదియేమిరా విజయరాఘవ! యంచిలుదూటి బల్మిచేఁ
దీవరక త్తైనె పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ!.

ఈక్రింది పద్యమున్నూ ఆమహారాజును గూర్చి చెప్పబడ్డదే-

ఉ. రాజనిభాననా! పరసురాలవు జబ్బుగ నల్లి నా వ దే
మే జడ? యింతకంటె వలెనే? వలెనే బిగియించి యల్లవే
యోజవరాల! వేఱ పనియున్నది; దోసనె!దోసమే!! మహా
రాజగునట్టియవ్విజయరాఘవ్రుమై చిగురాకె కోమలీ!.

ఇట్టిపద్యము లెన్నోవున్నవి. వేశ్యలు చెప్పినవే! పద్యాలు సరిగదా! పదాలెన్నెన్నివున్నవి! ఆహా! వందలువందలు! యక్ష గానాలెన్నెన్ని! ఎంతెంతస్వారస్యం! రెండుయక్షగానాలనుండి రెండుపద్యాలు రెండుపదాలుచూపుతాను:—విప్రనారాయణ చరిత్ర:— క. అక్కక్క! చూచితే వీఁ। డక్కట! మనదిక్కు చూడఁడంతటివాఁడా! । చక్కెరవిల్తునిగెల్చిన । ముక్కంటియు నన్నుఁజూచి మోహింపఁడటే!.

క. నీనటనలు గని చొక్కను । నానటనలు గాంచి చొక్క నటుఁడో విటుఁడో । యీనారాయణదాసుఁడు । సానులకును మానులకును సంగతి గలదే!.

పూతనాహరణనాటకం:—

నల్లనిదేవర నామము సాతిన। బల్లాలరాయను బసవయ్యక్కో నుకు॥ నారదయ్యసుప్పనాతిని పెళ్లాడి। బారతకతసెప్ప బైరదేవ రకు॥రంబకుబుట్టినరాబణుడవగాను। కుంబకర్ణుని పెద్ద కొడుకుగా

డంట్రా ॥ అతికాయుడాగదు డుబదర్మ రాజుతో। అతివకై పోట్లా డిరదివింతగాదా!॥ మనకు వరాలిచ్చే మైలారదేవర అనుమంతు దేవర కల్లుడుగాడా॥ తన్ను వేసివాడునన్ను త్తుకొనిపోయె।కన్నగా డుసూడుకాశేత్రినితో డు॥ దూడలుమేపుతూ। ఆడనున్ననన్ను। ఈడకుదెచ్చినవాడెవ్వడురా ॥ గొంగడిగానముకోపమువచ్చేని। గంగడుసేసినకపటముగాదా!॥ నాముక్కులోపలనాలికగానము। యేమిసేసిపోయెనెట్టడువచ్చి ॥ అక్కలమ్మకునేడుమొక్కుసెల్లింతాము। వక్కలాకులువేగవండరనోరి !॥ గొల్లలకెల్లనుకొలము దేవరవయి । యెల్లమ్మయెల్లమ్మ ! యేలుకోవమ్మా !॥

పాండ్యరాజులకు, ఈచోళరాజులకు, అచ్యుతప్పనాయని వారికాలంనుండి తగవులు సాగుతూ వచ్చినవి. తిరుమలశౌరి, భార్యను చంపినాడన్నసంగతి యెంతనిజమో ! సరియయిన గ్రంథదృష్టాంతములు కానరాలేదు. గొబ్బూరి- జగ్గరాజుమూలమున నడిచినయుద్ధం సుప్రసిద్ధం. చొక్కనాథనాయనితో యుద్ధంచేసి వీరస్వర్గం పొందేటప్పటికి విజయరాఘవనాయకుడు ముసలివాడు. ఆయుద్ధంలో స్త్రీబాలసహితంగా అందరూ హతమైనది సత్యము. ఆనగరిలో ఇప్పటిసరస్వతీమహాలులో ఒకపార్శ్వమందు స్త్రీలందరూ దగ్ధమైరని స్థలజ్ఞులు చెప్పుతూవున్నారు. ఇప్పటికిన్నీ, ఆపక్కలకు మహారాష్ట్రరాజస్త్రీలు యెవ్వరూ వెళ్లరట! అక్కడ కట్టడపుమీదితట్టునల్లగా మాడిపోయి చెక్కలుచెక్కలు రాలిపోయినగుర్తు. యిప్పటికీ ఆవెనకటిమహాదహన

మును జ్ఞాపకపరుస్తూవున్నది. పరువుమర్యాదలుగల రాజసంబంధులందరూ ఆమహాయుద్ధంలో మడిసిపోయినారు. నాయకరాజులు పుణ్యాలోపంచేత భూమిపై అవతరించిన దేవతలని చెప్పవచ్చును. వారిదశ ఆవిధంగా నడిచినది. భరతఖండములో ఉత్తరమున కాశ్మీరదేశము యెటువంటిదో దక్షిణమున చోళమండలము అటువంటిది. బంగారుపండగల ఆభూమిని పరిపాలించి నాయకరాజులుసంపాదించినభాగ్యమంతా దేవతలపాలు, భూదేవతలపాలు, చేసినారు. ఇప్పటికి తంజావూరుజిల్లాలో రెండువేల దేవాలయము లున్నవి. హిందూదేశం అంతటిలో దేవాలయములశోభ చూడవలెనంటే దక్షిణదేశంలోనే గదా చూడవలెను! వారు దేవాలయములు దేవతాస్థానములుగానే గాక రాజ్యాంగరక్షణస్థానములుగా కూడా కట్టినారు - తంజావూరు బృహదీశ్వరుని ఆలయపుకట్టుదిట్టం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. తంజావూరుజిల్లాలో అగ్రహారములకూ, ధర్మసత్రములకూ మితిలేదు. పంచనదం మొదలైన పుణ్యక్షేత్రముల వైభవం దర్శించి తీరవలెను. ఆకావేటికాల్వలసొంపు చూచితీరవలెను. విద్యావిశారదులుగనుక ఆనాయకరాజులు సరస్వతీ భాండాగారంవొకటి నెలకొల్పినారు. అద్భుతగ్రంథములు అనేకం అందులో వున్నవి. పోయినవిపోగా ఆనాడు యజ్ఞనారాయణదీక్షితులు, రంగాజి, మొదలైనవారు తమచేతులతో వ్రాసిన తాటాకులపుస్తకములు కొన్ని యిప్పటికీ ఆపుస్తకభాండాగారములో

వున్నవి. నాయకరాజులు లేరుగాని యిదివఱకు ఉదాహరించినవిధ
మున రాచనగరు ఇప్పటికీ వున్నది. ఆకొల్వుకూటము లున్నవి.
ఆరామభద్రవిగ్రహాలు ఉన్నవి. ఆఁగాఁగులచప్పరా లున్నవి.
సంగీతశాల లున్నవి. గరడీకూటము లున్నవి. కేళీతటాకము లు
న్నవి. ఆయుధాగారము లున్నవి. ఎన్నెన్నో వున్నవి. ఆయాభాగ
ము లన్ని గ్రంథదృష్టాంతముల ప్రకారాన పరిశీలించి గుర్తించి
కాలవైపరీత్యమునకు కటకటా! అని వగచి కన్నులనీరు కార్చి
నాను. దక్షిణదేశంలోని ప్రజలు ఇప్పటికిన్నీ నాయకరాజుల
పుణ్యకథలు ఒళ్లుపులకరించగా, కన్నుల ఆనందబాష్పములు రాల
గా, స్మరిస్తూ వుంటారు! ఈవిషయం ఇంతట నిలుపుతాను -
ఫలమేమి ?*

చొక్కనాథనాయనివారి ప్రతినిధిగా తంజావూరుకు వచ్చిన
"అళగరి" ఆంధ్రభాషపై అత్యంతాదరము కలవాడు. కామే
శ్వరకవిచేత యితడు సత్యభామాసాంత్వన మనేకృతి చెప్పించి

---

*చం. చిలుఁపలితావులుం జవులుఁజిమ్మెడు కమ్మనిపూవుఁ దీఁగలో।వల
గొనిగానలక్ష్మినిలుపన్ జెలువమ్మలరించు రూపరే। ఖలొ యనునట్లు
తంజపురిఁగన్నులు కొండలుగొబ్బిపాటమె। చ్చులొలుక వీనులంగనులఁ జూ
బ్బనచూలలు జుట్టిపొంగితిన్.

మ. వినునోవీనులు, కాంచునోకనులు, నుర్విన్ఘ్రూరునోజిహ్వ నె। మ్మనమే
మయ్యెనో, తక్కనంగములు నెమ్మొడిక్కంబ్రవర్తించునో। యనుమానింపఁగ
రాక తంజపురి దివ్యస్తవ్య మార్గంగిక। స్వనగానామృతపానపుందమి మహో
త్సాహంబు మాకేర్పడెన్.

నాడు. చొక్కనాథనాయనివారికి అతడు సవతితమ్ముడని సత్యభామాసాంత్వనములో వున్నది. ఇందులో దూదుభాయి అని వున్నది.

*ఇంక రాయసం వెంకన్న నియోగిగారి పన్నాగములు పరికించండి; బలేతంత్రగొట్టు. చెంగమలదాసును ఉద్ధరించేటందుకు కంకణం కట్టినాడు. అళగిరికి, చొక్కనాథనాయనికి స్నేహం చెడగొట్టినాడు. కావలసినపరివారం కూర్చుకొన్నాడు. ఎంతెంతో చేసినాడు. చెంగమలదాసును సింహాసనమెక్కించి నాయకరాజ్యం నిలవబెట్టినాడు. ఈతనిచరిత్ర యీవిధంగానే నడచివుండెనా చాణక్యుడు, రాక్షసుడు, యుగంధరుడు, మొదలైనవారివలె జగత్పూజ్యుడై వుండేవాడు. ఈపరిశ్రమ అంతా స్వార్థంకోసం నడిచినది. స్వార్థానికి భంగంవచ్చేటప్పటికి, తాను కోరుకొన్న పదవి తనకు రాకపోయేటప్పటికి, కూడదీసినరాజ్యం కూలద్రోసినాడు. అంత ఘనకార్యం నడిపినవానికి తగదుగదా యింతక్షుద్రపు స్వార్థవాంఛ! తననీచబుద్ధికిఫలం అనుభవించకపోయినాడా! అన్నీ అన్నిగానే యేర్పడినవి. దానీది రాజ్యాంగవిషయంలో అలోచన

---

* ఇతడు బింకాలమారి. పొగడితే పొంగిపోయేవాడు. తంజావూరికోట నాలుగుతట్టులనూ యేకోజీని నాలుగురోజులలో తాను వోడించినట్టు "పెదగ్గిరివిజయము" అని గ్రంథం చెప్పించుకొన్నాడు. ఊళక్కి గెల్పుచాటించుకొన్నాడు. నాలుగుదిక్కులకూ నాలుగు ఉత్పలమాలికలు పెద్దవి. మొత్తం చరణాలు 530 ఉంటవి. గ్రంథం పెరిగి పోతుంది. కొంచెంకూడా ఉదాహరించలేను.

చెప్పడమేమిటి? కోమటిబిడ్డ మంత్రిత్వమేమిటి? "కోమటిపిరికినూ తిరోవ్వరికే" అంటారు. చేతగానివారతనంగతి యీవిధంగానే వుంటుంది. ఇంతకూ, రాయసం వెంకన్నే చేతులారా చెరిచినాడు. తానుచెడ్డాడు. చోళరాజేలినా, పాండ్యరాజేలినా ఇద్దరూ తెలుగు వారే, మనవాళ్లే. పిట్టతగవుపిట్టతగవు పిల్లితీర్చిందన్నట్టు తగవుల న్ని చల్లార్చి తానే యేకోజీ రాజ్యంకట్టుకొన్నాడు 1674 సంవ త్సరమున; ఈయేకోజి జగత్ప్రసిద్ధుడయిన శివాజీకి తమ్ముడు, నాటితోసరి చోళదేశానికి తెలుగురాజ్యపుసంబంధం; నాటినుం డి నిన్నమొన్నటిదాకా యేకోజీసంతతివారే మహారాష్ట్రులే పాలించినారు. వీరు నాయకరాజులకీర్తిని నిలిపినారేగాని చెరప లేదు. వీరూ పెక్కుమంది తెలుగుకవులను ఆదరించినారు. తెలు గుభాషను మిక్కిలి పోషించినారు. మహారాష్ట్రరాజులచిత్రపట ములు ఎన్నెన్నో తంజావూరునగరిలో వున్నవి. కాని నాయక రాజుల చిత్రంపటం వొకటికూడా కానరాదు. మహారాష్ట్రరా జులే నాశపరచివుందురు. కాలప్రవాహం మహారాష్ట్రరాజుల నూ ముంచివేసినది. భవభూతివర్ణించినట్టు అంతామారిపోయిం దిగాని ఆమేడలు, మిద్దెలు వగైరాలు ఇంకా చెడక వెనకటి స్థితి గతులను స్మరింపజేస్తూ వున్నవి.

దక్షిణదేశంలోపుట్టిన తెలుగుప్రబంధాలు వందలువందలు. ముక్కుమొగం చూడక కొందరు వెక్కిరిస్తున్నారు మంచిప్ర బంధాలుకావని; కాని, వారిమాటలను మనం పాటించరాదు.

మంచికాలం వస్తుంది. అందరూ వాటివల్ల ఆనందిస్తారు.

అసలుకు మించిపోయింది కొసరు. అయినా చెప్పవలసిన సంగతు లెన్నో చెప్పనేలేదు. విడిచిపెట్టినాను. ఈ ప్రచురించిన అసలు కథావృత్తాంతం చెన్నపురిలైబ్రరీలో వున్నది. హెచ్చు తగ్గులు చెయ్యలేదు. కాని, కొత్తచేసినాను. భాషాస్వభావంపాడు చెయ్యలేదు. ఇందులో కథలవంటి సందర్భములు కొన్నివున్నవి. ముక్కరవృత్తాంతం మొదలయినవి. నేను తీసివేయలేదు. మధుర రాజులచరిత్రకూడా వ్రాయవలసినదే. ఆంధ్రులు పూర్వ మింత ప్రాభవము అనుభవించినారు. నాయకరాజులకీర్తిని ఆరాధించవలెనే కోరికను ఈవిధముగా తీర్చుకొన్నాను.

చెన్నపురి.<br>10-6-1914.

వేటూరి - ప్రభాకరశాస్త్రి.

---

* సీ॥ చోళదేశము మున్ను చుట్టుముట్టెరిపాండ్య మండలంబున వెన్కనిండి రాంధ్రు। లవలఁగేరళదేశ మాక్రమించి రిమీఁద సింహళంబునకు నంజియలు నైచి। రలవాఁడుతమబాస తెలుఁగుబాసయెరాజ భాషగాఁబూజింపఁ బడియె నచట। నాంధ్రులిప్పటికినన్యెయ్యి దేశములయందుఁగలరెంద రెందరో కలను తెలుఁగు॥ గీ॥ ఆంధ్రులన ద్రావిడులనంగనన్నదమ్ము। లొక్కఫలమునబీజము లిన్నిక్కమిప్పు। డెందునైకమత్యంబునఁ బొందిపొసఁగి। యాత్మహితములసం దుట యుక్తము కద!

శ్రీ ర స్తు.

# తంజావూరి యాంధ్ర రాజుల చరిత్ర.

ఆదిలో కృష్ణదేవరాయలవారు కటకం మొదలుకొని కన్యా కుమారిదాకా దేశం లోపరుచుకొని సుఖసత్కథావినోదంతో విజయనగరంలో రాజ్యం యేలుతూవుండగా, మధురలో చంద్రశేఖరపాండ్యుడున్నూ తంజావూరులో వీరశేఖరచోళుడున్నూ రాయలవారికి వశవర్తులై రాజ్యంచేస్తూవుండిరి. అంలో తంజావూరు వీరశేఖరచోళరాజు బలాత్కారంగా మధుర చంద్రశేఖరపాండ్యుణ్ణి జయించి ఆరాజ్యం యావత్తూ కట్టుకొని యేలసాగెను. అందువల్ల చంద్రశేఖరపాండ్యుడు యెత్తుపడి విజయనగరం రాయలసముఖానకువచ్చి జరిగినవర్తమానం విన్నవించుకుంటూ "మాదగ్గిర కప్పంపుచ్చుకుని మమ్ము ఆజ్ఞలో నడిపించుకొనివస్తూవున్నారు. లోకంలో "దుర్బలస్య బలంరాజా" అని న్యాయం వున్నది. మాకు గతి యేమి ఆజ్ఞాపిస్తున్నారో ఆలా నడుచుకొంటున్నాము. మాకుదిక్కు మీరుగాని మరియెవరూలే" దంటే అప్పుడు రాయలవారు ఆమాటలువిని ఆగ్రహపడి తమతో శేఖానా అధికారిఅయిన నాగమనాయని పిలిపించి దక్షిణరాజ్యం యావత్తూ మీతో శేఖానాకు అడమానం వున్నదిగదా! యిట్లావుండగా పాండ్యడిరాజ్యాన్ని చోళుడు బలాత్కారంచేసి

కట్టుకోవడమేమిటి? మీరే సైన్యసమేతంగా పోయి అదుష్టుడైన వీరశేఖరచోళరాజును తగినట్టు శిక్షచేయండి. ఈపాండ్య రాజుకు యథాప్రకారం రాజ్యంయిప్పించండి. చోళరాజ్యం జప్తీచేసి సర్కారుయిలాకాలో మనుష్యులనువుంచి మీజమా బంది అర్థంమాత్రం మీరుతీసుకొని తిరిగిరండి అని ఆజ్ఞాపించిరి. అప్పుడు పాండ్యరాజును తోడుకొని నాగమనాయనివారు దళస మేతంగా వచ్చి వీరశేఖరచోళణ్ణి శిక్షచేసి ఆరాజ్యం తనవశం చేసుకొనిరి. తర్వాత మధురకుపోయి చోళుడువుంచివున్న ఠాణాలను తరమగొట్టిరి. కాని రాయలవుత్తరువుప్రకారం పాండ్యుడికియివ్వక ఆరాజ్యమున్నూ తానే అపహరించుకొని అనేకదినములనుండి పాండ్యుడికి స్వాధీనంగాని గ్రామాలు యావత్తూ ఆజ్ఞలోనికి తెచ్చుకొని స్వతహాగా రెండు రాజ్యాలు యేలుకుంటూ వుండిరి. అప్పుడు పాండ్యరాజు తిరిగి విజయనగరంపోయి రాయలవారిదగ్గిర "మీరయితే మాకు రాజ్యంయావత్తు కట్టియిమ్మని నాగమనాయనివారిని అంపించినారుగాని ఆయన చోళరాజును కొట్టి ఆరాజ్యంపాండ్యరాజ్యం రెండూ తానేకట్టుకొన్నాడు" అనిఫిర్యాదు చేసుకొన్నంతలో రాయలవారు నాగమనాయనిపేరను ఆజ్ఞవ్రాయించిరి. పాండ్యరాజ్యం పాండ్యుడికి పట్టంకట్టమంటేనీవు అపహరించుకొన్నావు. నిన్ను ఆవిధంగా రాజ్యమేలడానికిమేము అంపించలేదు గనుక యీఆజ్ఞచూస్తూనే చంద్రశేఖరపాండ్యుడికి పట్టంకట్టి అతిత్వరగా నీవు లేచిరమ్మని వ్రా

యించినారు. అప్పుడు నాగమనాయనివారు బదులువ్రాసిన దేమనగా — ఈగ్రామాలు యావత్తూ జాగ్రత్తచేసేటప్పటికి నేను అనేకద్రవ్యం కర్చుచేసినాను. ఈపాండ్యుడు ఇంతకులో వయిసం మీదగ్గిరకిరారాదా! ఇంత అరాచకంగా వున్నరా జ్యం మనకు స్వాధీనానకురాదని ఇదివరదాకా ఊరికేఉన్నాము. ఇప్పుడు చోళరాజునుకొట్టి రాజ్యం కట్టడంకాకుండా అరాచ కంగా ఉన్న రాజ్యంకూడా స్వాధీనంలోనికి తేవడంచూచినాము. ఇంతకుమునుపు రాజ్యంనాకు స్వాధీనానకురాదు. మీరు యా వత్తుకట్టుకొని నాకు అన్నవస్త్రాలకుమాత్రం జరిగిస్తేచాలు ను అని చెప్పుకొంటూ ఉండేవాడు. ఇప్పుడు అతనికి ఆశపు ట్టింది. అయితే నేమాయెను. అతనికి రాజ్యంఇస్తే నగరికి తోఫారూకలుకూడా రావు.

మరిన్ని ఇతను పాండ్యవంశం అని చెప్పుకోవడం మాత్రమే కాని జాతికితక్కువ. దాసికొమారుడు. రాజ్యం ఇతనికి అర్హం కాదు గనుకనే చోళరాజుకట్టుకొని యితణ్ణి వెళ్లగొట్టినాడు. దూరంగా ఉన్నాము గనుక ఈజాతినీతులు మనకు తెలియ లేదు. ఇంతకు నేను బహుదినములు తమకొలువు కొలిచినాను. ఇక కొన్నిదినములు అయినా సుఖపడవద్దా! ఇదిగాక అనేకద్ర వ్యం యీసంస్థానంమీద పెట్టి యింతమాత్రం రాజ్యం స్వాధీ నంలోనికి తెచ్చినాను. నాఅర్థం యావత్తు రాబట్టుకొని నేనువస్తానుకాని అంతపర్యంతం నేను వచ్చేదిలేదు—అని సమా

చారం వ్రాసి అంపించినంతలో రాయలువారికి బహుకోపం వచ్చింది. నాగమనాయఁడు మా ఆజ్ఞకు తప్పినడిచినాఁడు గనుక అతనితల మీరువెవరైనా తేగలరా అని అడిగెను. అప్పుడు నాగమనాయనికుమారుఁడు విశ్వనాధనాయనివారు లేచి రాయలవారిసముఖానికి వచ్చి, నాకు ఉత్తరువిస్తే తెస్తానని అన్నారు. అప్పుడు రాయలవారు "మీతండ్రిగారి దగ్గిరకు మీరుకూడాపోయి కలుసుకోవడానికి ఆజ్ఞ అడుగుతారా" అని ఆక్షేపిస్తే అప్పుడు విశ్వనాధనాయనివారు "ఎక్కడయినా కద్దా ? ఏలినవారిసొమ్ము తింటూవున్నాము. స్వామికార్యం ప్రధానం కాని తండ్రి ఎక్కువకా" దని అన్నారు. అప్పుడు సర్కారురాణువ అక్కరలేకుండా తన యెప్పటిబలం రెండువేలగుఱ్ఱంతో ఆరువేల కాలిబలంతో మధురసీమకు వచ్చి తండ్రిగారివద్దికి సమాచారం అంపించినవయనం ఏమంటే — మీరు రాయలవారి ఆజ్ఞకుతప్పి నడిచినారు. మిమ్ముని తలకొట్టితెమ్మని ఉత్తరువు అయింది. అయితే నేమాయెను. ఇప్పుడయినా పాండ్యరాజ్యం పాండ్యనికి పట్టంకట్టి మీరు లేచివస్తే రాయలవారితో చెప్పి మాపుచేయిస్తాను రండని సమాచారం అంపిస్తే తిరుగా నాగమనాయనివారు తనకుమారెడివద్దికి కబురు అంపించినవైనం— రాయలవారిపట్టున నీవు సమస్తరాజ్యాలు సాధించినావు గదా. ఇదిగాక నేనునున్నూ చాలారాజ్యం సాధించినాను. రెండుమూఁడు మాఱులు పోయిన సంస్థానం నిలువబెట్టినాము. నీవు

ఎంతమోహన్నతుచేసినా ఆఘనత నన్ను చెందవలెనుగాని మరి ఒకటికాదు. రాయలు విశ్వాసంకలిగినవాడే గనుకఅయితే పాండ్యరాజ్యం ఉన్నప్పుడు దాసికొమారుడు అనుభవిస్తే ఆయనకు వచ్చిందేమి ? మనం అనుభవిస్తే రాకపోయిందేమి ? నిన్ను బహుతపస్సుచేసి కన్నాము. ఏకపుత్రవిషయము; కాబట్టి నిష్కారణంగా నాతో ఎందుకు యుద్ధం చేస్తావు ? ఇంతకూ ఈరాజ్యంకట్టడం నీనిమిత్తంగాని వేరేలేదు. తమతో ఉమ్మని సమాచారం అంపిస్తే తిరుగా విశ్వనాధనాయనివారు తండ్రిగారికి సమాచారం అంపించినవయినం ఏమంటే— స్వామికార్యానికి తప్పినడిచినారుగనుక మీరు తండ్రులుకారు నేను కొమారుణ్ణికాను. మీరుసంపాదన చేసిన రాజ్యమున్ను నాకు అక్కరలేదు. తిన్నగా వస్తిరా ప్రభువువారిసముఖానికి తీసుకొనిపోయి ప్రాణానికి భయం లేకుండా చేయిస్తాను. అధవాఒకవేళ యుద్ధంచేసినా గెలిచేపాటిబలం మీకుభగవంతుడు ఇవ్వడు. నానునస్సులో ప్రతిజ్ఞ యేవిధంచేతనూ మిమ్ముతీసుకొనిపోయి రాయలవారియెదుట పెట్టడమే. అదే సకలసాంబ్రాజ్యాలు ఏలడంగనుక తండ్రీఅని విచారించను—అనిసమాచారం అంపించినంతలో నాగమనాయనివారు బహుకష్టపడుతూ అన్నమాటలు— నేను ఈకుమారుడు కలుగవలెనని బహుతపస్సుచేసి విశ్వనాథస్వామివారిని ప్రార్థించినందుకు నామీద కత్తియెత్తే కొమారుడుకలిగినాడు. ఈకొమారుడు బ్రతికినాసరే చచ్చినాసరే అని

తనతాలూకు రాణువయావత్తు కూర్చుకొని యుద్ధానికివచ్చెను. అప్పుడు ఘోరయుద్ధం అయింది. నాగమనాయనివారు కొమారునికి చాలక వోడిపోయి దొరికినారు. దొరకగానే విశ్వనాథనాయనివారు ఇంతమాత్రం ప్రాణాలతోను దొరికినారు మనం చేసినతపస్సు యొక్కబలం అని అంబారీమీదయెక్కించి చుట్టూ తనపారా కడాయించి తీసుకవస్తూ ముందు అతిత్వరగా తమతండ్రిగారికిన్ని తనకున్ను అయిన యుద్ధమున్నూ ఆయనదొరికినదిన్ని తాను ఖయిదుచేసి తీసికొని వస్తూవున్నదిన్ని సమాచారం వ్రాయించి అంపించిరి. నాటికి రాయలవారు కచ్చేరీవారిని గొప్పసేనానాయకులను పిలిపించి సెలవిచ్చినమాటలు-నాగమనాయనిమీదికిదండుఎత్తమంటే ఎవ్వడూమాచేత అయ్యేపనికాదు మీరుచూచి ఉత్తరువుఇస్తే అన్యాయముగా పోయి చచ్చిపోతామని అంటిరిగదా! విశ్వనాథనాయడు స్వామికార్యానికై తండ్రినిచేయించినపని చూచినారుగదా! అని ఆయనవ్రాయించి అంపించినజాబులు చూపించినంతలో కూర్చున్నసభయావత్తు ఆశ్చర్యపడి స్వామీ! అతను మనుష్యులలో పరిగణన అయినవాడుకాడు. కేవలంవిశ్వనాథస్వామేఅని సభవారు అంతా స్తోత్రంచేసిరి. రాయలువారు యిరుభుజాలుపొంగి యింతటిబంటును మనంపలినాముగదా అని సంతోషపడి అందరుఉండగా అన్నమాటలు — విశ్వనాథనాయడు మనుష్యులలో పరిగణన అయినవాడుకాడుఅని మీరు చెప్పిన మాటలేనిబద్ధి. ఆయన మన

కొలువుకిందఉంచుకోవడానికి యోగ్యుడయిన మనిషికాడు. ఇక ఆయనచేత కొలువుచేయించితే మనకు దోషంవస్తుంది. మనతోను సమంగా సింహాసనాధిపత్యానికి యోగ్యుడు. ఇదిగాక అడవిదున్నపోతును నరికినవాడున్ను పరాయి దేశపురాజుల దేశం కట్టుకొన్నవాడున్ను అయి రెండుమాట్లు సంస్థానం నిలిపినాడు గనుక ఆయనవచ్చినతరువాత యెక్కడనయినా రాజ్యం యిచ్చి మనతో సమంగా ఉంచవలెను—అన్నారు. అప్పుడుసభవారు అంతా విన్నపంచేసిన మాటలు—స్వామీ విశ్వనాధనాయనివారికి రాజ్యం అపేక్ష ఉంటే తండ్రిగారివద్దికి పోయినప్పుడు ఇద్దరు ఒకటి అయి ఆ రాజ్యాలు కట్టుకొని మనమీదికి కూడా దండు ఎత్తితే ఎదురుపోజాలకపోదుము. ఆయన కేవలం స్వామివారియొక్క అంశము గనుక తమచోట బహువిశ్వాసంగా అంత కార్యంచేసుకొని వస్తూవున్నారు తమరు సర్వజ్ఞమూర్తులు గనుక తమకు తెలియనిదేమి ఉన్నది? అని విన్నపంచేసినారు. మరి పది దినములకు విశ్వనాథనాయనివారు తండ్రిని తీసుకువచ్చి రాయలవారి యెదుటను నిలవబెట్టెను. రాయలవారు నాగమనాయణ్ణి చూచి ఇంతవిశ్వాసఘాతం చేసినావని అడిగితే అప్పుడు నాగమనాయనివారు విన్నపంచేసినమాటలు—పాండ్యరాజ్యం మీ తండ్రిగారు మాయొక్క తోశేఖానామీదను తనఖాయిచ్చినారు. నాటనుంచి అనేక ద్రవ్యం నష్టపెట్టుకొన్నాము. ఇదిగాక ఇప్పుడు చోళరాజునుకొట్టి పాండ్యరాజుకు రాజ్యం యిమ్మని

సెలవు ఇచ్చినారు. ఆయుద్ధంలో ఇక్కడనుంచి తమరు ఇప్పించి అంపించిన అర్ధంకాకుండా ఇంకా అనేకఅర్ధం కర్చుఅయింది. ఇట్లా బహుశ్రమపడి చోళణ్ణికొట్టి పాండ్యరాజ్యం యితనికి పట్నంకట్టించి పోతాము అంటే, ఈపాండ్యుడు అన్నమాటలు——చోళరాజును కొట్టడానకు తమరే గనుక సాధ్యపడినది. లేనట్టయితే ఎన్నటికి స్వాధీనానికి రాకపోను. ఇప్పటికిన్నీ రాజ్యం అరాచకంగా, ఎవరిగ్రామాలు వారు అనుభవిస్తూ మనకు స్వాధీనానికి రాక ఉన్నారు. చోళరాజు నన్ను అన్యాయంచేసి రాజ్యంకట్టినాడన్న పేరుమాత్రమేగాని ఆయనకూ ఈ గ్రామాలు యావత్తు స్వాధీనానికిరాలేదు. ఇంతకు మాయొక్క శత్రువును కొట్టినారు. ఇదేపదివేలు. ఇదిగాక నాకున్ను సంతానంలేదు. ఉన్నవారుఅంతా ఉంపడందానికొడుకులు. నాజీవం ఉన్నంతవరకూ మర్యాదగా జరుపుతూ నాకు అన్నవస్త్రాలకుమాత్రం యిచ్చి నాపగవాడయిన చోళరాజుకు మాత్రం చెందనివ్వక నాపేరుగా మీరే ఏలుకుంటూ ఉంటే చాలునన్నాను. అప్పుడు ఈరాజ్యాలు యావత్తు బహు అరాజకముగా ఉన్నవి. బహుధనం వ్యయంచేసి రాజ్యం బందోబస్తుచేసినాను. ఇప్పుడు మీదగ్గిరికి ఫిర్యాదుకు వచ్చినాను. అని వారికి తమకు జరిగినకార్యాన్ను, తమరు వ్యయంచేసిన అర్ధమున్ను, రాయలవారికి తెలియ బరచిరి. రాయలవారు చూచి అప్పుడు పాండ్యుణ్ణిపిలిచి "నీవు చాలాపెద్దమనిషివని, నీ

మాట బహునిబద్ధిఅసి, మేమునమ్మికొని యింతమద్దతుచేసి అంపించినాము. ఈసంగతులు నిజమగునాకాదా? అనిఅడిగితే నిజమే నేనుఅన్నది కద్దుగాని నాశరీరం ఉన్నంతవరకు మర్యాదగా గనుపుమన్నాను. అందుకు అట్కావు అయిందిగనుక ఫిరియాదుకు వచ్చినానని అంటే మునుపు ఇట్లాచెప్పరాదా అని బహు కోపంచేసిరి. అప్పుడు విశ్వనాథనాయనివారు రాయలవారిని మనవిపూర్వకంగా పాండ్యునిపై గర్వితం లేకుండా మాట్లాడవలెనని మనివిచేసుకొంటే విశ్వనాథనాయనివారి మాటలు చెల్లించిరి. అప్పుడు తిరుగా రాయలవారిని చూచి పాండ్యుడుఅన్నమాటలు—నేను యితనికొమారుడు విశ్వనాధనాయనివారికి రాజ్యంవ్రాసి యిచ్చినాను. నేను ఇప్పటికి ఆమాటతప్ప లేదు. రాజ్యం విశ్వనాథనాయనివారికి పట్టంకట్టితే బహుసంతోషం. అన్నంతట విశ్వనాథనాయనివారిని ప్రభువువారు చూచి మీతండ్రిని ఖయిదులో తెచ్చిపెట్టి రవంతైనా తండ్రి అన్న మాట విచారించక, స్వామికార్యం ప్రధానంచేసుకొని తలకొట్టుతానని అన్నావు గనుక నిన్నుచూచి మీ తండ్రిచేసినతప్పు క్షమించినాము. ఈదినం ఇంటికిపొమ్మనిఆజ్ఞాపించినారు. అప్పుడు నాగమనాయనివారికి ఖయిదు విడిపించి, ఇంటికి తీసుకొనివచ్చి యిక మీరు తండ్రులు నేను కొమారుణ్ణి ఇంతపర్యంతం నేను మీకు శత్రువను అని అనేకవిధాలను తండ్రిగారిని వేడుకొని స్నానంచేయించి, నూతనవస్త్రముల్లు కట్టబెట్టి, అనేక దాన

ధర్మములుచేసి ఆమరునాడు అనేక బ్రాహ్మణభోజనములు చే యించి తండ్రికొమాళ్లు బహుయిష్టంగా వుండిరి. నాయని వారు కొమార్డ్ణి చూచి నీవు రాజాంగంచేస్తూవుండవలెనని యింతపనికి ఒప్పుకొన్నానేగాని వేరుకాదు. ఇక నేను పరలోక సాధనం చూచుకొంటాను. నాకు ఇక కావలసినపని యేమి వున్నది? కనుక. నేను సంపాదనచేసిన అర్థంయావత్తూ వున్నది. అంతాతీసుకో. ఇదిగాక నీకు రాయలవారు రాజ్యం ఇస్తారు. మర్యాదగా కాపాడుకొమ్మనగా, కొమారుడు మీరార్జించిన అర్థంనాకుఅక్కరలేదు. మీరే దానధర్మములుచేసుకొని పర లోకసాధనం చూచుకొండనిఅన్నారు. అందుకు నాగమనాయ నివారు ఎక్కడనయినాకద్దా! బహుదినములు తపస్సుచేసి క న్నందుకు నీకుఇంతమాత్రం అర్థమయినాపెట్టకపోతే బాగావుం డదు అనితమపెద్దలు సంపాదనచేసిన అర్థమున్నూ ఇదిగాకతా ము సంపాదనచేసిన అర్థమున్నూ కొమారునికి కనుపరచి నంత లోవిశ్వనాథనాయనివారు కన్నులు తిరిగి యింతఅర్థం ఎల్లాసం పాదన చేసినారో తెలియదు అని ఆశ్చర్యపోయిరి. నాగమ నాయనివారు కొమార్డ్ణిచూచి తిరుగా అన్నమాటలు—పాం డ్యరాజ్యంలో మధురలో మీనాక్షి సుందరేశ్వరస్వామివారి దివ్యస్థలం ఉన్నది. ఆమీనాక్షిదేవి ప్రత్యక్షదైవం గనుక నాకు ఒకనాటిరాత్రి స్వప్నంలో నీకొమారుడు విశ్వనాథనా యుడు నాసన్నిధానాన ఉండి రాజ్యమంతా ఏలడానికి బహు

యోగ్యుడు అని చెప్పి ఉన్నది. ఈ అర్థమంతా తీసుకొనిపోయి పాండ్యదేశములో దేవస్థానాలున్ను ఇంకా ఏళ్లకు రాతికట్లున్ను కట్టి అనేకధర్మాలు చేస్తే నాకు పరలోకం కలుగుతుంది అని అన్నారు. తర్వాత రాయలవారు విశ్వనాథనాయణ్ణిపాండ్యుణ్ణికూడాపిలిపించి ప్రత్యేకం పాండ్యుడితోను అన్నమాటలు—నీకు ఉంపుడుదానికొమారుడు ఒకడు మాత్రం ఉన్నాడు గాని; తగినసంతానం లేదుగదా! విశ్వనాథనాయునివారికి దేశం ఇవ్వడం బహుసమ్మతి అని ఆయనపేరటికి వ్రాసి యిచ్చిఉన్నావు. అదిసమ్మతమా అని అడిగినారు. అప్పుడు పాండ్యుడు అన్న మాటలు;—నాకు సర్వథాదేశం అక్కరలేదు. ఒకవేళ నేనుదేశం కావలెనని కోరినా చోళరాజున్ను ప్రాణంతోనిలవనివ్వడు. ఇదిగాక, మాతండ్రితాతల ఉంపుడుసంబంధాలకు పుట్టినవారు శ్రీవిలిపుత్తూరు, తెంగాశి, రాజాపాలియం ఆస్థలములలో ఉన్నారు. వారు నన్ను తలచూపనియ్యరు. నాగమనాయనివారు అన్నిస్థలములు సాధించినారుగాని ఆ అయిదుస్థలములుమాత్రం సాధించలేక పోయినారు. వారు పంచపాండవులని పేరుపెట్టిఉన్నారు ఇంతకు నాపగవాళ్లుఅయిన చోళరాజుకు ఈపాండ్యులకు మాత్రం రాజ్యంయివ్వక విశ్వనాథనాయునివారు ఏలుకుంటే నాకు పరమసంతోషం. ఇప్పుడు రక్షించడానికి విశ్వనాథనాయుడు నాకు తండ్రివంటివాడు. పరలోకంలో సుఖపడడానికి కొమారుడువంటివాడు. అనగా అప్పుడు రాయలవారు విశ్వనాథనా

యనివారిని పిలిచి పాండ్యరాజ్యానికి పట్టంకట్టుతాము. మాకు సమంగా దక్షిణసింహాసనాధిపతివిగా ఉండుమని ఆశీర్వచనంచేసి పాండ్యరాజ్యానికిపొమ్మని ఉత్తరవుచేస్తే విశ్వనాథనాయనివారికి రాయసంస్థానములో ఉండే మహోన్నతపదవికంటె పాండ్య రాజ్యాధిపత్యం ఎక్కువగాతోచక తిరుగా రాయలవారితో మనిచేసినవయినం—తమ దర్శనంచేస్తూఉంటే ఇదేనాకు సమస్తదేశాధిపత్యమున్నూ సకలసామ్రాజ్యాలు ఏలడమున్నూ.ఇదివిడిచి వేరేఎక్కడకుపోతే తమదర్శనం లేకపోతుంది. ఇదిగాక నాకు తమదయవల్ల యేమిభాగ్యం తక్కువవున్నది గనుక ? అని విన్నవించినంతట్లో రాయలవారుచూచి నీవు కాశీవిశ్వనాథస్వామివి గనుక ఇంతవిరక్తిమాటలు అంటావు. ఇంతవిరక్తి ఉన్ననీచేత కొలువుకొలిపించుకొంటే మాకు దోషంవస్తుంది. ఈసంస్థానాన్ని తిరుగా నిలువతీసినవాడవు నీవు. ఎందుచేతనంటే అడవిమహిషాన్ని ముక్కలుగానటికి దుర్గకు బలియిచ్చినావు.పరాయిదేశపు రాజులు సంస్థానంమీదికి వచ్చినప్పుడు హీనబలంతోను పోయి వారిని సంహారంచేసి సంస్థానం నిలువతీసినావు. ఇదిగాక మీతండ్రిగారు పోయి మమ్మును లక్ష్యంచేయక ఆజ్ఞనిరాకరిస్తే స్వామికార్యమే ఎక్కువ అని పట్టితెచ్చి ఎదుటపెట్టి తలకొట్టుతానని అన్నావు. ఇంతమేలు నీవు చేసినప్పుడు, నిన్ను మరిస్తే మాకుదైవం సహాయముకాదు. లోవయినం నీవు రెండుమూడుపనులుచేసి మాదయ సంపాదన చేసుకొన్నప్పుడు నీకు

రాజ్యం మాతోసమంగా కల్పిస్తామని అన్నాము. ఇదిగాక ఈరాజ్యం నీపరంగా ఉంటేనేకాని నగరికి తోఫాయాకలుకూడా రావు. యిక నీవు పాండ్యరాజ్యానికి పోయి దేశం బాదోబస్తు చేస్తేనేకాని అనుకూలంకాను. మరిన్ని అక్కడ ఉండేవర్ణ సంకరపుపాండ్యులు అయిదుగురి పరాక్రమమున్ను విచారించగా ఉత్తరరాజ్యంరాజులతో అంతాఏకస్థులయి మనసంస్థానముమీదికికూడా దండువెత్తవచ్చునని తోస్తూవున్నది. దక్షిణసింహాసనానికి నీవు ఉండి వారినిఅణచి రాజ్యం బందోబస్తుచేసుకొంటేనే గాని అనుకూలించను. ఈసమయంలో నీవు లేకపోతే దేశంఅరాచకంగా వాళ్ళు ఆక్రమించుకొనిపోవడమేకాకుండా ఇంతపర్యంతంవచ్చి ఇక్కడిపాళెగాళ్ళతో కలుసుకొంటే తిరిగీ అవతారంయెత్తినా సాధించలేము. గనుక త్వరగా వెళ్ళి దక్షిణసింహాసనాధిపతివి కమ్మని సమాధానంపరిచినారు. అప్పుడు విశ్వనాథనాయనివారి మంత్రులు నియోగులు రాయలవారి సంస్థానానికి బలం దుర్గమహాలక్ష్మి దాన్ని మీరుఅడిగితే ప్రభువువారు లేదని చెప్పరు. అని ఆలోచన చెప్పినంతలో, విశ్వనాథనాయనివారు రాయలవారిసముఖానకు పోయి, దుర్గమహాలక్ష్మిని నాకుదయచేయవలెనని మనవిచేసుకోగా రాయలవారు సెలవిచ్చినవయినం—— ఈవస్తువు ఇచ్చేదికాదు. నీవు రెండుమూడుపనులు బహువిశ్వాసంగా జరిపినావు. అప్పుడు ఒకపని చేసినప్పుడే శరీరంకూడా ఇవ్వవలెనన్న బుద్ధి పు

ట్టింది. నీనోట ఎన్నడూ ఈవస్తువు కావలెనన్నమాట రాగా నేను వినలేదు. సుఖంగా తీసుకొని పొమ్మని సెలవుదయ చేసినారు. అప్పుడు రాయలవారి మంత్రులు "ఎక్కడనైనా కద్దా! ఈపట్నానికి దుర్గబలంగాని వేరేలేదు. సుఖంగా తీసుకొని పొమ్మని సెలవు దయచేసినారుగదా! తమరు ఏవస్తువు ఇచ్చినా ఇవ్వవచ్చునుగాని ఇదిమాత్రం ఇవ్వకూడదు" అంటే రాయల వారు అన్నమాట—విశ్వనాథనాయుడు ఎన్నడూ ఒకవస్తువు అడగలేదు. నేను ఇవ్వలేదు. ఇంతమాత్రం ఆయననోరు తెరిచి అడగడం బహుసంతోషమాయెను. నాశరీరం అడిగినా ఇవ్వడమేకాని వేరులేదు. అంతకంటె ఈపట్నం ఎక్కువకాదు. ఆయనకు ఇస్తామని వాగ్దత్తం అయింది. ఇక సోమసూర్యులు అటిటులయినా మావాక్కున యిస్తామని వచ్చినతరువాత తప్పదు పొమ్మన్నారు. అంతట విశ్వనాథనాయనివారు దుర్గమహాలక్ష్మిని తీసుకొని మధురకు వెళ్లేటప్పుడు తమసేన అంతా ఇచ్చి బహుసంభ్రమంగా అపించినారు. విశ్వనాథనాయనివారు అట్లావిచ్చేసి మధురసీమనున్నూ పాండ్యాడికోటనున్ను చూచేటప్పటికి రాయసంస్థానం చూచినకన్నులకు ఏమీరాణించక అరియనాయకంమొదలారిని బిసపాకం కేశవప్పనాయణ్ణి యిద్దరిని పిలిపించి యీకోట మాకు ఉండడానికి అనుకూలం కాదు. మధురచుట్టూ భైరవుడిబురుజులున్ను, ఎనిమిదిద్వారాలున్ను, కలిగినకోట, మీనాక్షిదేవికోవిల, సుందరేశ్వరస్వామివారికోవిల కట్టించ

మని ఉత్తరవు చేసినారు. అప్పుడు ఆరియనాయకం ము
దలియారిస్న్ని, కేశవప్పనాయుడున్ను మనివిచేసిన వయినం—
ఇంతపనికి మనదగ్గిర బొక్కసంలో అర్థంలేదు. ఇప్పుడుఇందులో
ఇమిడిఉంటే మరికొన్నిదినములు జరిగినతర్వాత మీాచిత్తం వచ్చి
నట్టుపనిచేస్తామని అన్నారు. అందుకు బహుకోపంచేసి మాతండ్రి
గారు సంపాదనచేసిన అర్థం ఉన్నది తెప్పిస్తాము ఇందువల్లను
పని అవుతుంది అని చెప్పి ఆధనంతో ఆఘనకార్యములు సా
గించి నెరవేర్పించెను. ఆదినములలో విశ్వనాథ నాయనివారు
ప్రతిదినం బ్రాహ్మముహూర్తమందులేచి ఆరాధ్యులనామావళు
లు, అధ్యాత్మసంకీర్తనలు, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేం
ద్రమోక్షం, భారతసావిత్రి, దధివామనస్తోత్రం, గంగావతరణ
ము, భారత భాగవత రామాయణసంగ్రహస్తోత్రములు, ము
చుకుందస్తుతి, సంజయనీతి, చాణక్యనీతి, వైరాగ్యశతకంమొద
లయినవి శ్రవణముచేసేవారు. దర్పణావలోకానంతరం కన్యకా
మణులను కపిలకామధేనువులనుదర్శనంచేసి పిమ్మట దంతధావ
నముచేసి నామతీర్థమయి విభూతిధరించి పేరోలగమైకూర్చునేవా
రు. అంతట పాండ్యదేశంలోనిదివ్య తిరుపతులనుంచి శివస్థలాల
నుంచి తీర్థప్రసాదాలువిభూతిమొదలయిన ప్రసాదాలు, పట్టుకొని
వచ్చినవారిని తీసుకురమ్మనమని ఆజ్ఞాపించేవారు. వారుతెచ్చినప్ర
సాదాలు అంజలిచేసి అందుకొని తమకొలువులో ఉచితాసనము
లు ఇచ్చి కూర్చుండమని ఆళ్వారు తిరునవల్లి శ్రీవైకుంఠం శ్రీవి

లిపుత్తూరు శ్రీరంగం మొదలయినయిరవై నాలుగు దివ్యతిరుప తులవారిని, ప్రసిద్ధిఅయిన పదునాలుగు శివస్థలాలవారిని వారి కుశలప్రశ్న అడిగి, మన్నించి పంపించి తర్వాత రాచ కార్యాలు నిర్వహించుకుంటూ వుండేవారు. వెనుకటి పాండ్య రాజును విశ్వనాథనాయనివారు ఎంతో గౌరవంతో నడిపిరి. వృద్ధుడుగనుక ఆయన కొన్నిమాసములకు స్వర్గస్థు డాయెను.

విశ్వనాథనాయనివారే చోళరాజ్యం, పాండ్యరాజ్యం రెం డురాజ్యాలూ తమ యేలుబడికింద పెట్టుకొని విద్యానగరం రాయలవారికిలోనుగాపరిపాలనం జరుపుతూవుండేవారు. ఆవిధం గా కొన్నిసంవత్సరములు గడచినతర్వాత శ్రీకృష్ణదేవరాయ లతమ్ములు అచ్యుతదేవరాయలవారు రాజ్యానకు వచ్చిరి. ఆ యనభార్య తిరుమలమ్మ. ఆమెచెల్లెలు మూర్తిమ్మను వివా హమాడిన చెవ్వప్పనాయనివారికి అచ్యుతదేవరాయలవారు స్త్రీధనంగా చోళరాజ్యందయచేసి, పట్టాభిషిక్తుణ్ణిచేసి, కావలసి న వస్తువాహనసామగ్రిన్నీ యిచ్చి అక్కడకు పంపించిరి. చోళ దేశానికి ప్రత్యేకంగా నాథుడులేనందువల్ల విశ్వనాథనాయని వారినేగాక స్వజనంగా అక్కడ మరివొకరినికూడా యేర్పరచవ లెననే తలంపుతో అచ్యుతరాయలవారు ఈవిధంగాచేసిరి. చెవ్వ ప్పనాయడు అక్కడ విశ్వనాథనాయనివారికి పొందివున్న రాజ్యం అధీనంలోనికి తెచ్చుకొనెను. ఆయన అరుణాచలంలోను వృద్ధాచలస్థలంలోను అనేకగోపుర ప్రాకారమంటపాదులు నిర్మిం

చి తంజాపూరులో శివంగికోట కట్టించి తన పేర శివప్పనాయని గుంట అని తటాకం త్రవ్వించి దేవాలయబ్రహ్మాలయాల కెంతో విశేషముగా స్థితులుకలుగచేసి బహుదినములు రాజ్యమేలెను. అటుతరువాత అతనికుమారుడు అచ్యుతప్పనాయడు గోవింద దీక్షితులకు దళకర్త ప్రధానికమిచ్చి బహుకీర్తిచంద్రుడుగా చోళదేశమందు అనేకఅగ్రహారాలు దేవాలయ బ్రహ్మాలయాదులైన అనేకధర్మాలు కలుగజేసిచాలాకాలంరాజ్యమేలెను.

తర్వాత అతనికుమారుడు రఘునాథరాయడు సకలశాస్త్రములయందును మహాప్రవీణుడయి సకలధర్మములును విచారించి కుంభకోణమందు రామస్వామిగుడి కట్టించి ఎన్నోఅగ్రహారములుతటాకములు కలుగ జేసి విజయవిలాసం మొదలయిన అనేక గ్రంథములు అందుకొని రామాయణం మొదలయినగ్రంధాలు రచించి మహాప్రసిద్ధుడుగా బహుదినాలు రాజ్యమేలెను.ఆయన కుమారుడు విజయరాఘవనాయడు పట్టాభిషిక్తుడై రాజ్యానకు వచ్చి తంజాపూరుకోట బలపరిచి నగరు విస్తారముగా హెచ్చించెను.అతండాగి(?)పట్టుకోటశేళాతల్లి తిరుపత్తూరు ఈ నాలుగుకోటలున్ను ఒకముహూర్తమందే ఆరంభించి రాతికోటలుగాకట్టించెను. మన్నారుగుడిలో రాజగోపాలస్వామికి గోపురమంటపప్రాకారములు విస్తారము నిర్మించెను.మాయూరమందు మధ్యార్జునమందు కావేరిస్నానఘట్టములలో పుష్యమంటపాలు పదివేల ప్రజవుండేటట్టు విశాలముగా కట్టించెన్ను. అనేకదేవాలయబ్రహ్మా

లయములకు నిరంతరస్థితులు కలుగజేసెను. ఆయన ప్రతిదినము ఉదయమయిన జాములోగా పంన్నెండువేల బ్రాహ్మణ్యానికి షడ్రసోపేతముగా జ్యేష్ఠాంశమిప్పించి తరువాత తాను భోజనము చేస్తూ ఉండేవాడు.ఇట్లా ఉండగా, ఒకసంవత్సరం వర్షాలు ప్రబలమై యెక్కడచూచినా జలప్రళయముగా జడివానపట్టి ఒకయింటిమనిషి ఒకయింటికిపోవడానికి వీలులేకపోయెను. బయటినుండి వంటచెరుకులుసహితము వచ్చేటందుకు ఇమ్ముగలుగలేదు. సంగ్రహించియున్న వంటచెరుకులన్ని సమగ్రముగా సెలవయి పైనడిచేటందుకు మార్గం లేకపోయెను. అప్పుడు అన్నదానవిచారణచేసే కార్యస్థులు రాజా విజయరాఘవనాయనింగారి సమస్థానకువచ్చి మహాప్రభూ ! ప్రబలమయినవర్షాలు రాత్రిపగలు ఎడవిడువక కురవడంచేత ఎక్కడచూచినా నదులు అతిప్రవాహమయినవి.యిల్లువిడిచి మనుష్యులు బయట సంచారం చేయ సాధ్యపడడంలేదు. వంటచెరుకులు దొరకక బహు యిబ్బందిగావున్నది. ఇదివరకు సంగ్రహించి ఉన్నవన్ని నేటివరకు సరిపోయినవి. రేపటిమొదలు బ్రాహ్మణభోజనం నడిచేటందుకు ఇమ్ములేదు. కనక, నిలిపి, వర్షాలు వెలిసిబైటనుండి కట్టెలువచ్చినపిమ్మట యథాప్రకారం యత్నంచేయవలసి ఉన్నది.అని మనవిచేయగా ఆమాట కర్ణకఠోరమై ఉలికిపడి దిగ్గునలేచి "అయితే మేమున్నూ మానగరిలోనివారున్ను అంతవరకు నిరాహారముగా ఉండవలసిందే గాని భోజనంకూడ దని ఆజ్ఞాపించిరి.

ఆకార్యస్థులు గడగడవణికి అతిభయస్థులయి "స్వామీ ! మా యందు కొంచెమైనా వంచనలేదు. అయితే ; ఇకను ఆజ్ఞాపించినప్రకారము నడుచుకుంటున్నాము" అనగా నగరిమిద్దెలుపాతవి పీకగొట్టి ఆదూలాలున్ను చిన్నపలకలున్ను మంచాలున్ను కొట్టి చీల్చి వుపయోగించి బ్రాహ్మణభోజనమాత్రం కుందకం కాకుండా నడిపించమని సెలవిచ్చిరి. ఆప్రకారం మిద్దెల్లు కొట్టి మంచాలు నగర ఉన్నవన్ని తెప్పించి గొడ్డళ్ళచేత చీలిపించి వాటితో రెండుమూడుదినాలు తక్కువ లేకుండా పండ్రెండు వేలకు బ్రాహ్మణభోజనం నడిపించిరి. అదిన్ని సరికట్టి తిరిగీ వంటచెరుకులు లేక వారు రాజుతో వచ్చి చెప్పగా నగరిబొక్కసం తెరచి అందులోవున్న అనర్ఘ్యమయిన వస్త్రాలన్నీ పరిబయట వేసి, తమ నగరి ఉగ్రాణములో ఉన్నవిన్ని అంగళ్లలో ఉన్నవిన్ని నూనెకుండలు, నేతికుండలు రప్పించివాటిలో ఆవస్త్రములుతడిపి దివిటిపందాలుచేసి రగలబెట్టి వంటచేయమని సెలవిచ్చిరి. ఆప్రకారం చేయగా పొగ చుట్టుకొని మనుష్యులు ఎంత శ్రమపడుతూవున్నా వంట కొంచెమయినా కాకపోతూవుండెను. రాజున్ను ఆబ్రాహ్మణులు భోజనము చేయకమునుపు తాను భోజనం చేయకూడదని వీరవ్రతముగా ఉండెను. ఇక్కడ యిట్లావుస్తూవుండగా శ్రీరంగస్థలమందు అమ్మవారు శ్రీరంగనాచారుయొక్కముత్యాలముక్కర కానక ఆగుడిఅధికారి స్థానికుల

ను, అర్చకులను పట్టి రప్పించి సమాధానం చెప్పవలసినదని అతికఠినమయిన దండన చేయగా అమ్మవారు ఒకబ్రాహ్మణ ము త్తయిదువమీద ఆవేశమై వచ్చి "నిరపరాధులయినవీరిని ఏల ఉపద్రవపరుస్తారు? నాభక్తుడు విజయరాఘవుడు బ్రాహ్మణ సంతర్పణకు శీఘ్రం వంటకాకపోగా బ్రాహ్మలు ఉపవాసం ఉన్నారని తానున్ను ఉపవాసమున్నాడు, గనుక నేను ఆవంట సాలకు పోయి శీఘ్రం వంట అయ్యేటట్టు చేసినందున అక్కడి పొగ ముఖమందు మిక్కిలి తగిలింది. అప్పుడు కముగు కొప్పెరదగ్గిర ముక్కు చీదివేసినప్పుడు ముక్కర చేతికి వచ్చి అదిన్ని ఆకముగుతొట్టిలో పడింది." అని తెలియచేసినందువల్ల ఆగుడిఅధికారి స్థానికులను అర్చకులను దండించక విడిచిపెట్టి ఆక్షణమే రాజా చొక్కనాధనాయనివారిసముఖాన యీవయినం శ్రుతపరిచెను. అప్పుడు చొక్కనాధనాయనివారి అనుజ్ఞచొప్పున వారి మనుష్యులున్ను గుడిస్థానికులున్ను తంజావూరికిపోయి రాజా విజయరాఘవనాయనివారిసముఖాన ఈవర్తమానం పలుకరించగానే ఆశ్చర్యపడి తానే లేచి ఆవంటసాలకు పోయి ఆగురుతున కముగుతొట్టి శోధించ మనగా, అదేప్రకారం ముక్కర దొరికెను. ఆముక్కరను రాజు నమస్కారంచేసి కళ్లతోఅద్దుకొని శిరస్సున వుంచుకొని ఆనందబాష్పములు ధారలు జారగా "ఈ అపరాధం నేను ఏరీతి తీర్చుకోగలుగుదునని అమ్మవారిని తలచుకొని నమస్కారము చేసిరి. అంతట ఆమాదిరి పన్నెండుముత్యాపు

ముక్కరలకు మచ్చయినరత్నాలు చెక్కించి తయారుచేయించి యింకా ఇరవై నాలుగు వేలవరహాలున్ను అపరాధం పెట్టి అమ్మవారిముక్కరతో పల్లకిలో ఉంచి తనబిరుదులు అన్నీ పట్టించి నగార నౌబత్తు మొదలయిన అష్టాదశవాద్యములతో నటనాటకులతో శ్రీరంగం అమ్మవారిసన్నిధికి అంపించినారు. అదిమొదలు ఆస్వామి అమ్మవార్ల సన్నిధికి పోయేటందుకు తంజనగరానికిన్ని శ్రీరంగానికిన్ని ఉన్నదూరం మూడామడకున్ను యాభయిజోళ్ల బోయీలను నిరంతరం తపాలఉంచిరి. విజయరాఘవనాయనివారు ప్రతిదినం నాలుగుగడియలు ముందే లేచి సూర్యోదయమయ్యేటంతలో స్నానజపపూజలన్నీ తీర్చుకొని ఆతపాలమీద శ్రీరంగానికిపోయి స్వామిదర్శనం చేసుకొని పదహారోగడియకు తిరిగి వచ్చి భోజనం చేసేవారు. ఈవిధంగా మహాభక్తితో నడుస్తూవుండగా కొన్నిదినాలకు పిమ్మట రాజా చొక్కనాథనాయనింగారు తమ వివాహార్థముగా తంజావూరి రాజా విజయరాఘవనాయనివారివద్దికి తమబంధువులను స్థానాపతులను పౌరోహితులను కూర్చి వారిభేటికి యోగ్యమయిన వస్త్రభూషణాదులున్ను ఇచ్చి అంపించిరి. వారున్ను వచ్చి భేటి చేసికొన్నందున విజయరాఘవనాయనివారు వచ్చినవర్తమాన మేమి అని అడిగిరి. వారున్నూ "మాయేలినస్వామివారు తమవివాహానికి కన్యకార్థము దేవరసముఖాన మనవిచేయవలసినదని అంపిచగా వచ్చినాము. రాజా పెదవీరప్పనాయనివారు

మొదలుకొని రాజా తిరుమలశౌరిగారివరకున్ను నడిచివచ్చిన సంబంధముగాని నూతన చుట్టరికముగాదు గదా! దేవర వారుదయ చేసి శుభవార్త ఉత్తరువు చేయవలె" నని అడిగినందుకు రాజా విజయరాఘవనాయనింగారు మహాకోపముతో, "ఇంతైనా భయంలేక కన్యకను ఇమ్మని అడుగవచ్చినందుకు తగిన శాస్తి చేయవలెను. గతమే పీఠపితామహులైన తిరుమలశౌరికి మా యచ్యుతరఘునాథమ్మగారిని పట్టపుమహిషిగా వివాహం చేసినారు. అతను కొత్తగా నగరుకట్టించి మా అచ్యుతరఘునాథమ్మగారికి కనుగొనిపించినప్పుడు ఆమె హాస్యముగా తమ తండ్రినగరికి సమానం రాదని ఒకమాటఅన్నందుకు సహింపులేక బాకుతో పొడిచినారు. ఆసమాచారం విన్నప్పుడే మావారందరున్ను ఇటువంటి దుష్కృత్యులకు తెలియక వివాహం చేస్తిమి. ఇకమీద వారికి మనకు సంబంధములే అక్కరలేదని ప్రతిజ్ఞ చేసినారు. ఇట్లా జరిగివుండగా తిరిగి సంబంధం కావలెనని యేబుద్ధితో మీదొర మావద్దికి మిమ్మును పంపించినా" డని వారు కొంచువచ్చిన భేటివస్తువులు అంగీకారంచేయక వారికి బత్తెంభరణం విచారించక "మరేమైనా వేరుపనులు కలిగితే మావద్దికి రావచ్చును. ఇటువంటిపనులు కోరి యికమీద వస్తే తగిన ఆజ్ఞ చేయింతు" మని ఉత్తరువిచ్చి కోటకు బయట కొంచుపోయి విడవమని సేవకులకు ఆజ్ఞాపించినారు. ఆమేరకు కోటకు బయట కొంచుపోయివిడిచినారు. ఆవచ్చినకార్యస్థులు మహా

చింతాక్రాంతులయి మనదొరలకున్ను మనకున్ను ఇంత అవ
మానం వచ్చెనే అని ఆక్షణమే వెళ్లినవారు వెళ్లినట్టుగానే త్రి
శిరపురంచేరి తమ దొరవారిసముఖాన ఈనడచినవృత్తాంతం యా
వత్తూ శ్రుతపరిచిరి. ఈమాటలు వారికి కర్ణకఠోరములయి దళ
వాయి వెంకటకృష్ణప్పనాయణ్ణి పిలిచి దండుసామాను సేకరించ
మనిన్ని అక్కడక్కడ ఉండేపాళెయగాళ్లను దండు కూర్చవలసి
నదనిన్ని ఉత్తరువుచేసిరి. ఈ సమాచారం తంజావూరువారికి తెలి
సి ప్రతిదినం శ్రీరంగస్వామిదర్శనానకి రావడం నిలిపి నామతీర్థంసజ్జ
అని ఒకమాడి ఉన్నతముగా కట్టించిరి. దానిమీద శ్రీరంగాభిము
ఖంగా నిలిచి విమానదర్శనంచేసుకుని తర్వాత భోజనంచేసేది. ఇ
ట్లాఉండగా కొంతకాలానకు వారు త్రిశిరపురాన దళమంతా సే
కరించుకొనిరి. అప్పుడు చొక్కనాథనాయడు భక్తప్రియ స్వామి
వారిని రప్పించి తంజావూరిమీదికి మనదళాన్ని దళవాయి వెంక
టకృష్ణప్పనాయణ్ణి అంపిస్తున్నాము. జయమయ్యేటట్టు స్వామి
ఆశీర్వాదం కలుగవలెను. అనగా వారు మహామహాత్ములు గనక
పదివేలకూశ్మాండములు రప్పించి రాత్రివేళ కావేటిలో నిలిచి మం
త్రించివాటిని కత్తితో తునుకలుచేసి ఆజలములో విడిచిపెట్టుతూ,
ఇట్లా ఎనిమిదిరాత్రిళ్లు ప్రయోగంచేసి దొరను తమవద్దికి రప్పిం
చి యిక మీదళాన్ని అంపించమని సెలవిచ్చిరి. అంతట దళ
వాయి వెంకటకృష్ణప్పనాయణ్ణి పేష్కారి చిన్నతంబిమొదలా
రిని సకలదళసమేతముగా ప్రయాణం చేసిరి. వీరు వల్లంకో

టకు పోయి దిగి యుద్ధం సాగించగా స్వాములు గుమ్మడికా యలు కొట్టి మంత్రించి విడిచినజలం తీసినందుచేతను, నగరివా రికి అపజయకాలం సమీపించినందుచేతను, వీరిదళం చూచినం తనే వారికి యేమో భయము తోచెను. కొంచెం యుద్ధం చే యగానే వీరు నెగ్గుతూ వారువిరిగి పారిపోతూవచ్చిరి. వీరు ఆవ ల్లంకోట తీసుకొని తంజాపూరికి పొయ్యేటప్పటికి ఆజనము న్ను అల్లాగే యెదిరించి విరిగిపోతూవచ్చిరి. వీరు కోటసమీ పానుకు పోగానే ఆసమాచారం విజయరాఘవనాయనివారు పూజలో ఉండగా ఎరుగజేసిరి. వారు పూజ సమగ్రం కాకుం డా లేనకూడదని తమదళనాయన్ని పిలిచి దళంతో ఎదురెక్కి యుద్ధం చేయమని సెలవిచ్చి పూజచేస్తూనేఉండిరి. అదేప్రకా రం దళవాయిన్ని వారిసైన్యమున్ను ఎదురెక్కి జగడంచేయ సాగిరి. అప్పుడు తంజనగరంకోటపై అనేకబలం ఆనివున్నారు. అది వీరుచూచి యేమాత్రమైనా సరకుచేయక దండుపుకొలిపి ఫిరంగులు మోర్జాలపైయెత్తించి కోటపైపని, అందువున్నజనంప యిని, లక్ష్యంవుంచి పదివేలు యిరవైవేలు గుండ్లు యెగిరిం చిరి. అంతలో కోటపైని వుండేరాణువఅంతా వోర్వలేక చెల్లా చెదరై పోయెను. కొందరు వీరి యిలాకాఅయినారు. అంతట ఈమధురవారి దళవాయి వేంకటకృష్ణప్పనాయకుడున్ను, పేష్కారి చిన్నతంబిమొదలారిన్ని తమదళాన్ని రెండుచేతులుగా పంచు కుని లోవొచ్చి కలిసినందువల్ల తమలో యేనూరుజనమున్నూ

తంజావూరివారిలో వేయిజనమున్ను చచ్చిరి. ఇంకావారిలో అనే
కమంది గాయాలతో పడిరి. అంతటితో వారిదళం విరిగి పరుగెత్తిపో
యెను. దళవాయిమాత్రం కొంతదళంతో నిల్చి యుద్ధంచేసెను
గాని, త్రిశిరపురంవారిది బహుదళంగనక చుట్టుకొని ఆ నిలిచిన సేన
నున్ను దళవాయినిన్ని కొట్టివేసిరి. కోటవాకిళ్లమీద ఫిరంగులు
పెట్టికొట్టగా తలుపులు పగిలి అచ్చటిజనమున్ను విరిగిపోయెను.
అప్పుడు పెట్లకొట్లు, అగడ్తలు, బహుసామానులచేత మూయిం
చిరి. కొంతబలము ఫిరంగిదెబ్బలచే యిడిసిపడిన తోవలవెంటను,
కొందరు వాకిళ్లవెంటను, హల్లాచేసి కోటచొచ్చినారు. ఈసంగ
తులు నడిచేతరుణమందు అచ్యుతవిజయరాఘవనాయనివారు
నామతీర్థం కొలువులోవుండి తదేకధ్యానముతో జపంచేస్తూనే
ఉన్నారు. అప్పుడు వారి యిలాకామనుష్యులు ఓమహారాజా!
పగతురు మనకోటను హల్లాచేసి లోచొచ్చినారు. అని విన్నవిం
చగా అతను మహానారాయణ భక్తిగలవాడు గనుక ఆపూజ
విడిచి లేవక రానీ చూచుకొందమని సన్నచేసినారు. దళవాయి
వేంకటకృష్ణప్పనాయకుడు మహావివేకస్థుడు గనుకనున్ను, మహా
యోధగనుకనున్ను అప్పటికి అప్పటికి అచ్యుతవిజయరాఘవ
నాయనివారికి చెప్పిపుత్తెంచినవిధము - అనేకసైన్యముతో కూడా
హల్లాచేసి, కోటలోను చొచ్చినాము. మీాసైన్యము, మీాకోట
యావత్తు మాయిలాకాఅయింది. ఇంకను మీాప్రయత్నం ఏమి
నడవబోతుంది గనుక? ఇకనైనా సమాధానం మాట్లాడండి.

మాపౌజు వెనుకకు తీసుకొనిపోతాము అనిఅంతలంతల చెప్పిపం
పించినవార్త విని పూజకడవెళ్లకనే తదేకధ్యానముగా జపం
చేస్తూవిజయరాఘవనాయనివారు మారాజ్యంమొదలయిన సకల
మున్నూపోయినా పోతుందిగాని, మేము మీకు భయపడి
కన్నెనుఇచ్చి రాజీ చేసికొందుము అనేయోచన విడిచిపెట్టండి
అనేదిగా, మహాధైర్యములో సన్న చేసి చెప్పి అంపించినారు.
ఆసంగతులు విని దళవాయి వెంకటకృష్ణప్పనాయకున్ను దళా
న్ని తీసుకొని అచ్యుతవిజయరాఘవనాయనివారి నగరి హజార
ముదగ్గిరికి పోయినారు. ఇంతలోగా వారున్ను నామతీర్థం కొ
లువుచేసుకొని ఆయుధపాణులై హజారంబయటికి వచ్చేటప్పటికి
వారి మనుష్యులలో త్రిశిరపురంవారి యిలాకాగా, కూడిపో
యినవారు పోను స్వామికార్యధురంధరులుగా వారివద్దనే హా
జరుగా కాచుకొనిఉన్న దళవాయి రంగప్పనాయకు, పట్టపు ఏ
నుగువాడయిన తిమ్మామావటీడు,చొక్కరౌతు, వీరబాణంచిన్న
రాజు, అక్కరాజు, ఈఅయిదుగురున్ను మహాశూరత్వంతో
అనేక విధములైన ఆయుధములుధరించి తమ్ము చుట్టుకొనివచ్చిరి.
అప్పుడు అచ్యుతవిజయరాఘవనాయనివారు ఉండే ఠీవి యేమ
నగా :—ఎనభై సంవత్సరాల బలవృద్ధులు గనుక రెండు కను
బొమ్మలున్ను మహామృదువులయి సడలి ఉండగా వాటిని బం
గారు దారముచేత ఎత్తి కట్టించుకొనిరి. కొంచెముగా జారిన
పిల్లిబొజ్జమీద మేలుతరములయిన పీతాంబరములు ధరించుకొ

నిరి. నవరత్నస్థాపితములయిన అనేకభూషణములున్ను ధూన్చు కొనిరి. రెండుచేతులను అతి తీక్ష్ణములై మెరుగులు వారుతూ ఉండేకత్తులు తీసికొనిరి.

ఇందుకుముందుగా, ఒకప్పుడుపడో కోపంగల్గి తమకొమారుడు మన్నారప్పనాయనివారికి బంగారు సంకిళ్లువేయించి బందుచేసి ఉంచిరి. దళవాయి రంగప్పనాయడు యోచనచేసి అతణ్ణి ఈతరుణమందు పిలిపించవలెనని అచ్యుతవిజయరాఘవనాయనివారితో విన్నపరచగా, అందుకు వారున్ను సమ్మతించి "మంచిది అట్లే సంకిళ్లుతీయించి పిలుచుకురా" మ్మనిరి. ఆక్షణం మనుష్యులు పోయి సంకిళ్లు విడిపించి పిల్చుకొని వచ్చినారు. అప్పుడు మన్నారప్పనాయడు తమతండ్రిగారిని చూచి,

క. మణి క్రిందుపఱచి జలనిధి,
తృణముం బై నుంచె నతనిదే దోదవనుమీ,
మణి మణియె తృణము తృణమే,
రణవిజయదిలీప! విజయరాఘవభూపా!

అని యీపద్యం చెప్పి సాష్టాంగముగా నమస్కారంచేసి చేతులుమోడ్చి నిలిచెను. అప్పుడు అచ్యుతవిజయరాఘవనాయనివారున్ను యిటువంటి కొమారుణ్ణి చిన్నమనుష్యుల మాట విని ఖైదుచేస్తిమే అని వ్యసనపడిరి. కొమారుడున్నూ తండ్రికి ముందుగా యుద్ధానికి సిద్ధపడి నడిచెను. అప్పుడు ఎదటిదళం చూచి విజయరాఘవనాయనివారు సెలవిచ్చిన సైన్యం - నేటికి

మనం ప్రాణాలువిడిచేది సిద్ధం. మనం చనినపిమ్మట మహాలు లోనివారు ఉంటే త్రిశిరపురంవారు తనమాట చెల్లించుకో వలెనని మనచిన్నదానిని తీసుకుపోయివివాహంచేసుకుంటారు రాజ్యములు ప్రాణములు పోయినాగానీ, వారుపట్టినపట్టు చెల్లనియ్యరాదు. మన పౌరుషం నిలుపుకోవలెను. లేదా పేరుకు హాని వచ్చును. కాబట్టి అందరినిన్ని మనమే దైవికం పొందించవలెను. అని యోచనచేసి చెప్పి ఆకార్యం నిమిత్త ముగా, తమ కొమారుణ్ణి, అక్కిరాజును, ఇద్దరిని మహలులోకి అంపించినారు. ఇంతకుమునుపే త్రిశిరపురంవారిసైన్యాధిపతియ యిన దళవాయి వెంకటకృష్ణప్పనాయను విజయరాఘవనాయ నివారిని చూచి నమస్కారంచేసి చెప్పినవయినం- ఏలిన దేవరా! తాము మహాయోధులుగాఉండిన్ని ఒక కొద్దిపనినిమిత్తం యింత చలమేలచేసుకొంటారు. తమకున్ను మా యేలినస్వామివార్ల కున్ను ఇప్పుడు నూతనబంధుత్వం కోరడం కాదుగదా! మహా రాజా పెదవీరప్పనాయనివారి దినాలనుండి తమకు వారికి శ్రీకో దకన్యాయముగా బంధుత్వం నడుస్తునచ్చిన సంగతిలో ఇప్పుడు ఇంతహటం చేయడమేల? ఇందువల్లగదా ఇంతపని నడిచింది! ఇకమీదనయినా మీరు, వారు, అన్యోన్యముగుండి! అని యి ట్లా వారి మహల్లో నిప్పు తగిలించేటందుకు మునుపుగానే, అ నేకవిధాల చెప్పినప్పటికీ వారు అవి వినక మేము రెండుమాట లు చెప్పేదిలేదు. ముందుగా ఈలాగు చెప్పి యిప్పుడు ఇట్లానడ

వడం మేము మీకు భయపడి లోకువ కానడమేగదా! "ప్రాణమేవ
పరిత్యజ్య మానమేవాభిరక్షతు" అన్న క్రమానికి ఏమిపోయినా
ప్పటికిన్ని మానం కాపాడి కీర్తిసంపాదించవలెను. గనుక మీరు
ఏమీ యోచనచేయక మాతో యుద్ధానికి రండి; అని వారినిత్సా
హికరించి యెదురునడిచిరి.

అక్కడ అంతకుముందే ఎదుటిదళం కోటవచ్చినారని
వినగానే రాణివాసపుస్త్రీలు తమవారినందరినీ చేర్చుకొని ఒక
సేకరంగా తమవద్దఉంచుకొని మందుకుండలు తెప్పించి చుట్టూ
పెట్టుకొని కత్తులు జముదాళ్లు దూసుకొని కూర్చుండి ఎప్పుడు
ఏలినవారి ఆజ్ఞయేమివచ్చునో అని యెదురుచూస్తూ వుండిరి.
వీరిద్దరు పోగానే యేలిన స్వామివారికి క్షేమమా! మాకు ఏమి
ఉత్తరువిచ్చిరి. అని ఆరాజస్త్రీలు అడుగగా మన్నారప్ప
నాయకు రాజువారిఆజ్ఞ హెచ్చరించెను. వారున్ను ఎప్పుడువత్తు
రో అనితయారుగా ఉన్నారమని అదేప్రకారం పరలోకసన్నాహం
చేసేటప్పుడు ఒకపట్టపుస్త్రీ తన నాలుగేండ్లపసికొమారుణ్ణి ఆబిడ్డ
కు పాలిచ్చిపెంచే దాదివశంలో వొప్పగించి యీ బిడ్డనుమా
త్రం యెవ్వనికి తెలియకుండా ఎక్కడనైనా నీకు సరిపోయిన
తావుకు కొంచుపోయి సంరక్షించుకొమ్మని తాను వేసుకొన్న
రత్నభూషణాలతో సహా అంపించివేసెను. ఆక్షణమే వారు ఒక
రికొకరు కత్తులచేతను, కటార్లచేతను, నరుకులాడి కొందరు
పరమగతిపొందినారు. అంతలో వీరిద్దరుచుట్టూ మందుకుండలు

ముట్టించినారు. ఆ అగ్ని జ్వాలలు ఛటచ్ఛటాయమానమై నగరు అంతా ఆక్రమించి దావానలమువలె మండుతూవుండగా విజయరాఘవనాయనివారు చూచి మనస్సున ఖేదం చేరనియక "మన్నారుదేవా! ఇది నీకేఅర్పితం" అని రాజగోపాలుని గుడికేసి చూచిమొక్కి "రాజగోపాలునికల్పితం" అంటూనడిచిరి. ఇంతలో అంతఃపురంలోని దారుణకృత్యంఅంతా కడతేర్చి కాలాంతకులవలె వారిద్దరున్నూ వచ్చిచేరిరి. ఎదటిదళమున్ను ఈయారుగురిని వచ్చి చుట్టుకొనెను. అప్పుడు దొరలిద్దరూ వినాగ కడమనలుగురున్ను నాలుగుకత్తులుతీసుకుని నాలుగుపార్శ్వాలుచొచ్చి అనేకులను నరికి వారున్ను మృతిపొందిరి. అంత విజయరాఘవనాయడు తనకొమారుణ్ణిచూచి "నీవైతే నాకుముందుగా నడుస్తున్నావు. మనకిద్దరికిన్ని మరణం సిద్ధముగాఉన్నది. అయినా నాకళ్లముందర నీవు ఎదుటివారిచేత తగులుపడ్డా మరణమైనా మహత్తైన పుత్రశోకం గదా! కళ్లలో జలంవచ్చును. ఈయుద్ధరంగాన ఆలాగైతే పరలోకహానిగనక నాకు వెనుకనిలిచి నా పని అయినపిమ్మట నీకుసరిపోయినట్టుగా చూచుకో" అని వెనకకు చెయిపట్టి యీడవగా, ఆకొమారుడు తండ్రినిచూచి చెప్పినది:—సకలధర్మములు తెలిసిన సర్వజ్ఞమూర్తులుగా ఉండిన్ని నన్ను వెనుకకు పొమ్మనేది న్యాయమా? మీరుతండ్రులు నేను కుమారుణ్ణి. మీరు రాజులు నేను బంటును. నన్ను కని పెంచిన రుణమును తీర్చుకొనేటందుకు, మీకొమారుడనే పేరుకు తక్కువరాకుండా నడుచుకొనే

టందుకు, ఇటికాలము గనుక ఇకను పక్వించెప్పవద్దని తనచేతి కత్తిదూసి గుప్పున యెదిరి సైన్యమును చొచ్చెను. ఆయన సాముచేసినవారు గనుక ఎదుటివారు కత్తులచేతను ఈటెలచేతను, బల్యాలచేతను చుట్టుకొని నరికేవరుకులున్ను పోట్లున్ను సాధనలాఘవములచేత తప్పించుకొంటూ అనేక జనాన్ని ఛేదంచేస్తూ దళవాయి వెంకటకృష్ణప్పనాయనిమీదికి పోతూ ఉండిరి. అతనున్నూ అనేకజగడములు జయించి "సంగరకిరీటి" "సవ్యసాచి" అని కీర్తులు పొందినవాడు గనక తమదళానికి మన్నారుదేవుడిమీద పోవద్దని ఆజ్ఞాపించెను. అంత తాను పట్టె, కేడం, తీసుకొనివచ్చి యెదిరించెను. ఇద్దరున్నూ నుంచి సాముసాదనలుచేసి తీరినవారు గనుక అతని నరుకు ఇతడు తప్పించుకొనేదిన్ని, ఇతని నరుకు అతడు తప్పించుకొనేదిన్ని ఈ రీతిగా కొంతసేపు పోట్లాడిరి.అంత మన్నారుదేవుడు బహుకోపముతో గుప్పున పైకి చెండ్లించుకొని తనచేతి ఫరంగుకత్తిచేత దళవాయిశిరస్సుమీద నరికేటప్పటికి అతడు సిడముచేత తప్పించుకొన్నందున అరకత్తి సిడెంమీదను, అర కత్తి తలమీదితలపాగవారను తగిలి అసిగాయమై నెత్తురు కనుపించెను. దళవాయి వెంకటకృష్ణప్పనాయడు ఆగ్రహోదగ్రుడయి యిక నాసాహసం చూడమని గద్దించి ఘాతచేసి పట్టాకత్తితో తనబలంకొద్ది నరికేటప్పటికి మన్నారు దేవుచేతికి కేడెం లేదు గనుకనున్నూ కత్తి చేత ఆనరుకుపట్ట

సాధ్యంకాకపోగా ముంజేత నరుకుపడి తెగెను. ఆచేల కత్తి పట్టగూడక యెడమచేత కత్తి సమాళించుకొని దళవాయిని నరికేటప్పటికి అతను కేడెం చేతపట్టుకొని తప్పించుకొనెను. కాని యెడమచేత కొంచెం గాయంతాకింది. అంతట దళవాయికి మహాకోపం వచ్చి పట్టా సదాయించుకొని పూచిపూచి కంఠం చూచి తనబలంకొద్ది తెగవేయగా మెడతెగి తలవేరు, మొండెం వేరు, గా మన్నారుదేవుడు క్రిందకూలెను. అది తండ్రిచూచి బహుక్లేశముతోను, ఆగ్రహముతోను, కత్తిదూసుకొని గద్దించి రాగా దళవాయిన్ని సైన్యమున్నూ వచ్చి చుట్టుకొనిరి. విజయరాఘునాయనివారు దళవాయినిచూచి మీవారికి తుపాకుల వేయవద్దనిన్ని కత్తులచేత,బల్యాలచేత,నరికి పొడువమనిన్ని ఆజ్ఞ యియ్యవలెను. ఏమంటే దూరాననుండి తప్పాగుండు తాకిచస్తే పరలోకహానిగాని ఆయుధమరణమువలెకాదు. నీకు తెలియని పనిగాదు గదా ! అనగానే "స్వామిబుద్ధి" అని తుపాకులవారిని దూరంపొమ్మని కత్తులవారిని మాత్రం చుట్టుకొమ్మని దిట్టపరిచెను. రాజు కత్తితీసుకొని యెదటివారిమీద దుమికి నరికేటప్పటికి వారున్ను ఎదిరించిరి. ఒకరికొకరు కత్తులుచేత నరుకులాడిరి. రాజుచేత నరుకులు తిని కొందరు చచ్చిరి. అంతట పక్కనున్నవారు కోపముతో ఒకపెట్టున కత్తులతో తస్సనేట్టు నరికేటప్పటికి రంగనాథ! రాజగోపాల! అని స్మరణచేస్తున్ను విజయరాఘునాయనివారు భూపతనమై స్వర్గస్థుడాయెను.

అప్పటికి శ్రీరంగస్థలమందు పూజాపురస్కారములై బీగముద్ర లై గుడిస్థానికులంతా వారివారియిండ్లకు పోయిరి. ఆసమయమందు రాజా విజయరాఘవనాయనివారు పూర్వపు మజలీలమీద స్వామిదర్శనానికి వచ్చే వొప్పునవనే బిరుదులు మొదలయిన ముస్తీబులతో గుడివాకిటికి వచ్చి వాకిలి తెరవమనెను. గుడివన్ణి యగారు, స్థానికులు, అర్చకులు, మొదలయినవారందరు మన దొరకున్ను వీరికిన్ని సమాధానమై యథాప్రకారం వచ్చినారో యేమో ననివచ్చి వాకిళ్లు తెరిచి స్వామిసన్నిధానానకు తోడుకు పోయి దరిసెనం చేయించి శఠగోపతీర్థప్రసాదములు ఇప్పించిరి. అంతలో విజయరాఘవనాయనివారున్ను వెంబడివచ్చిన మనుష్యులున్ను మాయమైపోయిరి. అందరున్ను ఆశ్చర్యపోయిరి. అతడు పరమభాగవతుడు మహాభక్తుడు గనుక స్వామిపాదారవిందములలో ఐక్యమాయెను; అని యీవర్తమానములన్ని తమ రాజు చొక్కనాథనాయనయ్యగారికి స్థానికులు పోయి విన్నవించిరి. అదివిని వారు, సదస్సులో ఉన్నవారందరు, ఆశ్చర్యపడుతూ వుండగా తంజాపూరినుంచి యుద్ధమైనసంగతిన్ని అందులో చివరకు రాజా విజయరాఘవనాయనివారున్ను వారికుమారుడున్ను వారివెంబడి వచ్చిననలుగురున్ను హతమైనవర్తమానమున్ను సవిస్తారముగా తపాల్లో కాకితంద్వారావచ్చింది. అదిచూచి మహాల్ సమేతం వారు మృతిపొందేటట్టు మనతో విరోధం పెట్టుకున్నారు; అటువంటి కాలసామాన్యం వచ్చిందనే వ్యసనమున్ను

మనలను తుచ్ఛముగా ఎంచి కన్యకనుకోరబోయిన మనుష్యు లను అవమానపరిచినందుకు పుత్ర మిత్రకళత్రాదులతో కూడా హతపరిచినామనే సంతోషమున్ను మనస్సున పెంపొందగా చొక్కనాథనాయనివారు తత్క్షణమే దళవాయి వెంకటకృష్ణప్ప నాయడికి నిరూపం వ్రాయించిరి. వీరికి ముందర మృతిపొందిన దొరలను యేప్రకారం యెత్తించేవారో అప్పుడు దానధర్మము లు యేపద్ధతిని చేయించేవారో అంత కధికముగా వార్లను యె త్తించి దహనము దానధర్మములు చేయించవలసినది; ఆకోటకు తక్కినగడిస్థలములకు, తాళములు వేయించి సీమజప్తీచేసి అందు కందుకు తగినమనుష్యులను నేమకంచేసి రావలసినది; అని వ్రా యించినకాకితం, అంచలలో అతిజాగ్రత్తగా గంటలు కట్టి అంపించమని ఉత్తరువు చేసిరి. పిమ్మట తాము కావేటికి వచ్చి స్నానం చేసి నూటయిరవై గోదానములున్ను పన్నెండుసెజ్జదా నములున్ను యిరవైనాలుగు అశ్వదానములున్ను అరవై కన్య కాదానములున్ను నూటయిరవై ఉపనయనదానములున్ను ప న్నెండుగ్రామదానములున్ను చేసిరి. శ్రీరంగం, జంబుకేశ్వరం, మథుర, రామేశ్వరం మొదలయిన గొప్పస్థలములందు అభిషే కనైవేద్యములున్ను లక్షబ్రాహ్మణభోజనములున్ను నడిపించే టట్టు తాకీదులు వ్రాసి అంపించమనిరి. నగరికివచ్చి ఆరాత్రి భో జనం చేయక ఉపవాసంగాఉండి మరునాడు భోజనం చేసినారు. నిరూపంఆజ్ఞవచ్చినప్రకారం అక్కడిపనులన్నీ జాగ్రత్తచేసుకొని

బొక్కసబండారములన్నీ శోధించి యెత్తించుకొని ఏనుగులు గు
ఱ్ఱములు తీసుకొని వారిబిరుదులున్ను ఆయుధములున్ను యెత్తిం
చుకొని సకలదళసమేతుఁడై వెంకటకృష్ణప్పనాయకుఁ జయభేరి
వేయిస్తూ త్రిశిరపురానకు వచ్చెను. తంజనగరం జయించి తెచ్చి
నపదార్థములన్నీ రాజుముందుగా ఉంచి బంగారుపువ్వులు, వెం
డిపువ్వులు పాదాలలో చల్లి జయబిరుదులు నివాళించి తానున్ను
పేష్కారి చిన్నతంబి మొదలారిన్ని సాష్టాంగముగా షత్రిమొక్కి
జరిగిన వృత్తాంతములన్నీ పలకరించిరి. చొక్కనాథనాయని
వారు మిక్కిలి సంతోషపడి వారికిన్ని వారివెంబడి వచ్చిన
సరుదార్లకున్ను వారివారికి తగినట్టు బహుమానములు చేయిం
చి పాళెగాళ్లకందరికి వస్త్రభూషణాదులు యిచ్చి యథాస్థానా
లకు పొమ్మని అంపించిరి. అమరునాఁడు తమకు పాలిచ్చి పెంచిన
దాదికొమారుఁడు అళగరన్న దూదుభాయి గనకనున్నూ ప్రేమ
పాత్రుఁడు గనకనున్నూ అతనికి సకల బహుమానములుచేసి ఏ
నుగులు, గుఱ్ఱములు, నగారా, నౌబత్తు మొదలయినమరాతపు
లన్నీ ఇచ్చి తంజావూరు సీమకున్ను కోటకున్ను సరుదారుణ్ణిచేసి
దేవాదాయబ్రహ్మదాయములన్నిటికి మామూలుప్రకారం నడి
పించమని చన్నవారితరపు బంధువులకు కార్యస్థులకు సైనికు
లకు జీవనస్థితులు కల్పించి నడిపించమని శిబ్బంది మొదలయిన
వాటి సెలవుపోగా కడమపైకం తమబొక్కసానకు పంపిస్తూ ర
మ్మని ఆజ్ఞాపించి పంపించిరి. ఆప్రకారం అళగరి తంజనగరానికి

వచ్చి ఐదుసు బాలకు తనమనుష్యుల నేమించి గడిస్థలాలకు సరు దార్లను నేమించి రాజ్యంచేస్తూ ఉండెను. ఇట్లా ఉండగా విజ యరాఘవనాయనివారి కొమారుడయిన చెంగమలదాసు అనే నాలుగేండ్ల చిన్నవాణ్ణి యెత్తుకుపోయినదాది నాగపట్ణములో ఒకవర్తకునివద్ద చేరెను. ఆవర్తకుడు అభిమానించి చేర్చుకొని కావలసినదంతా యిచ్చి నడిపిస్తూ తనయింట్లోనే యెవరికీ తెలి యకుండా ఉంచుకొని ఆచిన్నవానికి చదువు సాము చెప్పిస్తూ ఉండెను. పది పన్నెండు సంవత్సరము లయ్యేటప్పటికి మునుపు వీరితండ్రివద్ద ఉన్న రాయసం నియోగి వెంకన్న యీవర్తమా నం తెలిసి నాగపట్నానికి వచ్చి ఆవర్తకుణ్ణిన్ని దాదినిన్ని కని మాట్లాడెను. అక్కడ ఒకసంవత్సరం ఉండి నమ్మికవారుగా వారి సొంతమనుష్యులుగా అక్కడక్కడ తొలిగి వున్నవారిని రహస్య ముగా చెప్పంపించి యిన్నూరుజనందాకా రప్పించుకొని దొరకొ డుకుకు ఒకపాలకీ తనకొకపాలకీ దాదికి ఒకడోలీ యిన్నూరు జనములో పదిమంది కార్యస్థులకు పదిగుఱ్ఱాలు, యేర్పరుచు కొని యిందులకు తగ్గకర్చులు ఆవర్తకుడివద్ద తీసుకొని ఆవర్త కుడితోకూడా విజాపురానికి వచ్చిచేరెను. చేరి, అచ్చట ఒక సంవత్సరం కాచి కార్యస్థులను వశపరుచుకుని వారిమూలముగా అక్కడిపాచ్ఛాయి భేటిచేసుకొని నడిచిన వర్తమానములన్నీ చెప్పగా ఆతడు అభిమానించి మీరాజ్యం మీకు యిప్పిస్తున్నా మని అభయమిచ్చి వారికి పట్టేకర్చులన్నీ యిప్పిస్తూ దగ్గిర వుం

చుకొనెను. రాయసం వెంకన్న యుక్తిమంతుడుగనక నాగపట్నాన ఉండేటప్పుడే, ముందర విజయరాఘవనాయనివారివద్ద కార్యస్థులు, సామాజికులుగా వుండి యిప్పుడున్నూ సరదారుడుగా వచ్చిన అళగిరినాయడివద్దనే కుదిరి యిష్టంగా నడుచుకొంటూ ఉన్న వారిద్వారా ఒక మిత్రభేదం పుట్టించెను. ఇంతరాజ్యము కోట కొత్తళములు గడిస్థలములు చేత ఉండగా నీవు ఒకరికి వ్రాదగి వుండవలసినదేమి ? ప్రపంచములో ఒకరొకరు ఒక్కొక అవసరమున నేగిదా రాజ్యము సంపాదించి దొరతనాలు చేస్తున్నారు. నీకున్ను దైవయత్నముగా అదృష్టం కూడివచ్చింది. కనక విజయరాఘవనాయనివారు ఎట్లా స్వతహారాజ్యం ఏలినారో అట్లా నీవున్ను ఏలవచ్చునని వెంకన్న చెప్పి అంపించినప్రకారం వారు వారు దినాలపేరిట అళగిరినాయడికి కేవలం హితవు చెప్పతూ వున్నట్టుగా బోధించిరి. అతడున్ను వారిమాటలు హితవుగా ఎంచి రాజ్యము భోగభాగ్యాలు చూచుకొని గర్వించి దినాల పేరిటనే తనకు కావలసినబందోబస్తు చేసుకొని రాజా చొక్కనాథనాయనివారికి పయికమున్ను యియ్యడం మానివేసెను. నానాటికి నడిచే నడవళ్లలోకూడా తన యజమానుడనే లక్ష్యం వుంచక అలక్ష్యం చేయసాగెను. మునుపు విజయరాఘవనాయనివారు సమానవక్కణగా వ్రాసేప్రకారం కాకితపత్రములు తాను వ్రాసి పంపించెను. దళవాయిన్ని రాయసాలున్ను ఆకాకితవక్కణ చూచి "యేలినస్వామివారి దివ్యశ్రీపాదపద్మములకు

సేవకుడు అళగిరి సాష్టాంగముగా దండంబెట్టి సేయంగలవిన్నపా లు" అనేవక్కణ విడిచి తాను విజయరాఘవనాయడై అతను వ్రాసేప్రకారం స్వామివారిసముఖానికి వ్రాసినాడు. ఆవూరిభూ విశేషం! మనం ఉంచినమనిషి మనకు శత్రువైనాడు! అని రాజా చొక్కనాథనాయనివారికి శ్రుతపరిచిరి. బాల్యాదారభ్య చదువు సాములు సకలం మాతోకూడా అభ్యసించడంచేత అళగిరిని బహుప్రీతిగా ఉంచుకొన్నాము. అంత అభిమానం వున్న అతని నుంచి వ్యత్యాసం రాదు. ఎవరో మిత్రభేదముగా దుష్టసామా జికులు కూడి వాడికి బోధించి వ్రాయమన్నట్టుగా తోస్తూఉ న్నది. గనుక "ఎప్పటికి వ్రాసే విన్నపవక్కణ విడిచి సమాన వక్కణవ్రాసినది నీ వెటిగే వ్రాసినదా? లేక మనుష్యులమిత్ర భేదమా? తెలుపవలసిన"దని తాకీదువ్రాయండి. తెలుస్తుందని కార్యస్థులకు ఆజ్ఞాపించిరి. ఆతాకీదు చూచి అళగిరినాయడు తనకు బోధించినవారితో ఆలోచించి తంజావూరికి త్రిశిరపురా నికి ఎక్కువతక్కువ లేమి? ఈ సంస్థానానికి, ఆసంస్థానానికి, ముందు నడిచే మర్యాదప్రకారం వ్రాసినా మని బదులు వ్రాసెను. దా నిపై త్రిశిరపురాన వీరందరూ కూడి యోచించి మనం ఉంచిన వాడు మనకే శత్రువైనాడు. ఇప్పుడు వాడికి మంచిబలం యేర్ప డ్డది. కాబట్టి గొప్పప్రయత్నంచేసి కొట్టి సాధించవలెగాని అల్ప ప్రయత్నముతో సరిపడదని నిశ్చయించి తగినయత్నం చేస్తూ వుండిరి. ఈమిత్రభేదం అప్పటప్పటికి రాయసంవెంకన్న తెలుసు

కొంటూనే వుండేవారు. ఇంతలో అక్కడ బిజాపురంపాచ్ఛా యికార్యస్థులు, వెంకన్నఉపాయాలకు వశులై "తంజావూరుదొరకొరకు,కార్యస్థులు, వచ్చి చాలారోజు లయింది.కాచుకున్నారు. కనుక వారిపనికి వుత్తరువు చేసి పంపించవలె" నని పాచ్ఛాయిదగ్గిరికి వెళ్లి మనవి చేసిరి.అతడు అంగీకరించెను. చెంగమలదాసుకు, రాయసం నియోగివెంకన్నకు, బహుమతు లిచ్చెను. తంజావూరు సాధించి ఆదొరతనాన చెంగమలదాసును వుంచి బందోబస్తు చేసిరమ్మని తనవజీరు సహజిరాజు కుమారుడయిన యేకోజిరాజుకు ఆజ్ఞాపించి, పన్నెండువేల గుఱ్ఱపుఫౌజును, తగిన కాలిదళమును, వెంట యిచ్చెను. రాయసం వెంకన్నచూపి నమార్గంవెంబడిని దళసమేతుడై యేకోజిరాజు తంజనగరము మీాద దాడు వెడలెను. వీరిరాక తెలిసి అళగరన్న పదివేలజనంతో పదిఫిరంగులు తీసుకొని అయ్యంపేట వరకు వచ్చి యెదిరించి ఫిరంగీజగడము సాగించెను. ఏకోజిన్ని తనఫిరంగులు ముందుకు తెప్పించి ప్రయోగంచేస్తూ రెండుపార్శ్వముల గుఱ్ఱపు ఫౌజు పంచి విడిచి తాను కాలిబలాన్ని తీసుకొని మధ్య నడిచెను. ఫిరంగులచేత కొంచెము జనచ్ఛేదము అవుతూవున్నా అది సడ్డచేయక రాజు నడిమిచేత కాలిబలాన్ని తొక్కి నడిపించి ఫిరంగివేట్లకు లోగా రాగానే అళగరన్న తాలూకు యెలగోలు తుపాకిజనం ఆరువేలు ఒడ్డుతీరి తుపాకులచేత ఆనివేయసాగిరి. ఏకోజీవద్దైరా యెలగోలుతుపాకులజనం ఎనిమిదివేలున్ను తోర

సాలివాలాలజనం రెండువేలున్ను లక్ష్యంచేయక తొక్కి న
డిచి తుపాకులతో బల్యాలతో చొచ్చి చేయికలిసిరి. అప్పుడు
ఏకోజీవగైరాలలో నన్నూరుజనం మృతమయ్యెను, ఇన్నూటికి
గాయములయ్యెను. సడ్డచేయక తొక్కి నడిచినందున అళగర
న్నజనాన ఏన్నూరుజనం చచ్చి నూటయాభైజనం గాయాలతో
పడగానే దళం విరిగెను. అంతలో వెనకతట్టున ఏన్నూరుగుఱ్ఱ
ముతో నాలుగువేలజనముతో వెన్నానియున్న అళగరన్న ఆవి
రిగినజనాన్ని సేకరించుకొని అయినమట్టుకు ఆని జగడా చేయ
జొచ్చెను. ఇరుపార్శ్వముల గుఱ్ఱపుఫౌజు గుండుకట్టకుండా చు
ట్టుకు రాగా, రాజు వెన్నాని రాగా, పేష్వాయి, రాయసం
వెంకన్న, ఎలగొలున్ను, తొరసాలిబాకులవారున్ను నడిచేత
కొట్టుకొని తొక్కి నడిచేటప్పటికి అళగరన్నదళం నిలిచి యుద్ధం
చేసి నిర్వహించలేక తిరిగి విరిగిపోతూ ఉండేది చూచి అయిన
మట్టుకు గుఱ్ఱాన్ని అడ్డంచేసి నిలిపినప్పటికి జనం యెదుటిపెట్లు
చేత నిలువ లేకపోయెను. గుఱ్ఱాలవారు వెనకపార్శ్వాన నరుకు
తూ చుట్టుకొనిరి. ఇక నిలవలేక, విరిగి అళగరన్న నన్నూరు
గుఱ్ఱముతో నాలుగయిదువేలజనముతో ఒకటేదాడుగా, తిరిగి
చూడక తంజావూరుకోట ప్రవేశమయి త్రిశిరపురానకు రాజా
చొక్కనాథనాయనివారి సముఖానుకు తాను ఎప్పటిక్రమంతో:—
స్వామివారిదివ్యశ్రీపాదారవిందములకు సేవకుడు అళగరి సాష్టాం

గనుగా దండుబెట్టి సేయంగలవిన్నప మని వ్రాసి సీమ కోట, స్వామివారిది. సేవకున్నై వుండిన్నీ, వినరానివారి మాటలు విని దేవరచిత్తానకు ఆయాసం వచ్చేటట్టు నడుచుకొంటిని. ఆ నేరం క్షమించి యిప్పుడు నగరిపౌజును అంపించి రాజ్యం నిలుపుకోవలసింది. లేకుంటే శత్రువులు అపహరించుకొని పొయ్యేటట్టు ఉన్నది. వచ్చిచుట్టుకున్నారు. అని వ్రాసి పంపించినాడు. ఆ కాకితం దళవాయి వెంకటకృష్ణప్పనాయకున్ను కార్యస్థులున్ను దొరవారిసముఖాన చదివించి "బహుప్రయత్నంమీద తంజావూరిసంస్థానం తీసుకొంటిమి. అళగరన్న దుర్మార్గుడైతే వేరే మనుష్యుల నేమకంచేయవచ్చును. ఇప్పుడు సద్యః శత్రువులు అపహరించుకొని పొయ్యే టట్టు ఉన్నది. గనుక మనదళాన్ని అంపించి శత్రువులను కొట్టి రాజ్యం నిలుపుకోవలె" నని మనవిచేసుకోగా రాజా చొక్కనాథనాయనివారు చెప్పింది—"మనకు ఏకోజన్న అయితేనేమి? అళగరన్న అయితేనేమి? ఎవరు కట్టుకొనిపోయినా ఒకటే. మనకు అక్కర లేదు. మనం దళాన్ని అంపించవలసింది లేదు". అని ఖండితముగా ఉత్తరవిచ్చి అళగరన్నకు ప్రత్యుత్తరమున్ను వ్రాయవద్దని సెలవిచ్చిరి. అంత దళవాయిన్ని కార్యస్థులున్ను ప్రభుచిత్తం అట్లా ఉంటే మనం చేయువలసింది యేమని ఊరికే ఉండిరి. అక్కడ చెంగమలదాసున్ను ఏకోజిరాజున్ను తంజావూరుకోటమీద వచ్చి దిగి మో

జ్ఞాలు వేసి ఫిరంగులు ఎత్తికట్టి జగడం సాగించిరి. ముందర విజయ రాఘవనాయనివారివద్ద ఉన్న కార్యస్థులు కోటలో ఉన్నందు చేత రాయసం వెంగన్న అంతరంగముగా మనదొరబిడ్డకు పట్టం గట్టమని పాచ్ఛాయిదళం కూర్చి అంపించి వుండగా, మీరు పగవారితో చేరి ఉండవలసింది యేమి" అని చెప్పి పంపించెను. వా రందరు అళగరన్నను పట్టి వొప్పగించేటట్టు యత్నం చేసిరి. అది తెలిసి, అళగరన్న నాటిరాత్రి తనచిన్నచిరతలను మాత్రం పిలుచుకొని కొంచెం పదార్థం ఎత్తుకొని తనకు సొంతంగా నమ్మికగా ఉండే సన్నూరుజనముతో అరియలూరిమార్గముగా మైసూరిశీమకు తప్పించుకొని పారిపోయెను. కోటలోవుండే సరదార్లు కార్యస్థులు వచ్చి అగళరన్న నిన్నరాత్రి కోటవిడిచి చిన్నవాళ్ల సహితముగా, మాకెవ్వరికి తెలియకుండా తప్పిపోయెను గనుక మీరందరు సోహంగా కోటకు రావచ్చును. అని వెంగన్నతో చెప్పిరి. అయితే మీరు ముందుగా పోయి పట్నమున్ను నగరున్ను శృంగారించి వీథులలో తోరణాలు కట్టించి జాగ్రత్త చేయుండని కోటకు అంపించి వెంగన్న ఏకోజిరాజువద్దికి పోయి యీావర్తమానం తెలిపెను. ఏకోజిరాజు మహాసంతోషపడి జగడమున్ను జనచ్ఛేదమున్ను అక్కెర లేకనే రాజ్యము కోటస్వాధీనమయినది నీయొక్క బుద్ధితంత్రములచేతనే గదా అని తారీఫుచేసి జోడుశాలువలున్ను ముత్యాలహారమున్ను బహుమానంచేసెను. తోడుతో జయభేరి వేయించి చెంగమలదాసుకు జా

మూ, ఆజాతితలపాగ, నడికట్టు, కణ్కాపు, నిజారు, మొదలయ్యిన ముస్తీపులు చేయించి పచ్చలపోగులు, వజ్రాలపతకం, వజ్రాల బాజీబందు, గత్నాలుతోడాలు, మొదలయిన ఆభరణములు శృంగారించి, యేనుగుమీాది అంబారిలో కూర్చుండబెట్టి సకల దళసమేతముగా, ఏకోజీరాజున్ను, అలంకరించుకొని అంబారి మీాద కూర్చుండి పాళ్యమంతా బైట దించి, రెండుమూడు వేలగుఱ్ఱము ఆరువేల జనంమాత్రం అంబారీయేనుగులచుట్టు నిలుపుకొని ఉభయుల అంబారీయేనుగులున్ను సమానముగా నడిపించి, ఉభయులకు కలిగినబిరుదులు ముందుగా పట్టించు కొని, కోటప్రవేశమయ్యెను. నాలుగువీధులున్ను చుట్టి హజా రంవాకిట అంబారి దిగి చెంగమలదాసుచేతిలోచెయి గుచ్చు కొని నగరిలోపల ప్రవేశించి చుట్టి చూచెను. అఃగరన్న యెత్తు కుపోయినపదార్థములు పోగా, తక్కినసామాను సకలమున్ను శోధించి యేనుగులు, గుఱ్ఱములు, సకలసామగ్రి, చెంగమల దాసుయిలాకా చేసి, వెంకన్నగారివశం ఒప్పగించి కోటలోను సీమలోనున్న వారిమనుష్యుల నేమించమని యేర్పాటుచేసెను. పట్టాభిషేకానికి దినం చూడమని వెంకన్నతో చెప్పి యేకోజీ రాజు తనగుఱ్ఱంపవుజుతో కోటబైట తనపాళెండేరాలో వచ్చి దిగెను. కోటలో చెంగమలదాసు, వెంకన్న, ఉండి పురాతనం వారితండ్రివద్ద ఉన్నకార్యస్థులలో సరదారులలో చెదిరి యెత్తు బడిపోయినవారు పోగా, మిగతఉన్నవారిని లావణం ఉంచుకొని,

సీమకున్ను గడిస్థలాలకున్ను వారివారిని నేమకం చేసి సీమలకు వ్రాసి బియ్యం, పప్పు, పండ్లు, కాయగూరలు, వేటలు, కోళ్లు, మొదలుకొని సకలసామాను యథేష్టముగా రప్పించి ఏకోజీ సాహెబునకు అంపించగా అతడు చూచి సంతోషపడి తెచ్చి వొప్పగించిన కార్యస్థులకు వస్త్రములు, తాంబూలములు యిచ్చి అంపించెను. వెంకన్న పురోహితుల రప్పించి పట్టాభిషేకానికి దినం నిశ్చయపరచి పట్టణమున్ను, నగరున్ను, అలంకరింపించెను. ఆనాటికి కావేరిమొదలయిన పుణ్యతీర్థములజలమున్ను దివ్యస్థలాల తీర్థప్రసాదములున్ను, గంధపుష్పాలున్ను మరిన్ని కావలసిన సామగ్రులు, రప్పించి తయారుగా ఉంచుకొని యేకోజీరాజువద్దికి వెళ్లి నేడు ఇరువై అయిదుగడియలుకు సుముహూర్తం గనక మీరు దయచేసి కోటకు వచ్చి మారాజుకు పట్టం కట్టించి పట్నం ప్రవేశంచేయించవలెనని చెప్పెను. అదేప్రకారం ముస్తీబుచేసుకొని తనవద్దఉన్న సరదారులు, కార్యస్థులు, విద్వాంసులు, అందరిని ముస్తీబుగా రమ్మని కొంచెం గుఱ్ఱందళాన్నిమాత్రం తన అంబారిచుట్టువుంచుకొని యేకోజీ కోటలో ప్రవేశించెను. అప్పుడు చెంగమలదాసుకు, మంత్రవత్తుగా పుణ్యతీర్థములచేత అభిషేకములు చేయించి సకలాభరణభూషితున్ని గావించి, సింహాసనముందు కూర్చుండబెట్టి పట్టంకట్టి బ్రాహ్మలకు వస్త్రములు దక్షిణా, తాంబూలం, గంధపుష్పాదులు, ఇప్పించెను. చెంగమలదాసు, తాను, ఉభయపార్శ్వములలో ఉభయుల గుఱ్ఱపుఫౌజు

చుట్టిరాగా సమానముగా అంబారియేనుగులమీద సవారి అయిరి. రాజువెంబడివచ్చిన పేషువాయిన్ని, ఖానుమున్ను, సయ్యదున్ను, మరిన్ని గొప్పజమీన్దారులు, సరుదారులున్ను హౌదాలెక్క రెండుఅంబారులకు వెనకవుండిరి. వెంకన్న ఒకహౌదా యెక్కి తమరాజుఅంబారికి వెనకవుండెను. పార్శ్వానికి వేయిదీవట్లు, పగలువత్తులు, మతాబులు, చంద్రజ్యోతులు, ప్రకాశిస్తూవుండెను. బాణవేడుకలు జరుగుతూవుండెను. రెండుయేనుగుల ముందర రెండువిధాలుగా వేశ్యలు నటిస్తూవుండిరి. భట్లు పొగడుతూవుండిరి ఉభయచామరములు మోర్ఛలు పంచవన్నె పావడ చెంగావిపావడ తెల్లపావడాలు వేస్తూవుండిరి. శ్వేతచ్ఛత్రములు పట్టిరి. ఇంతమహావైభవంతో పట్నమేగివచ్చి నగరు ప్రవేశించి కొంతసేపు కొలువుకూటములో సంగీతసాహిత్యములు వింటూవుండగా చెంగమలదాసు, అంతకుమునుపే యేర్పాటు చేసివుంచినప్రకారం యేకోజీరాజుకున్ను, వారివెంబడివచ్చిన పేషువాయి మొదలయినకార్యస్థులకున్ను వారివారియోగ్యతకు తగినట్టు వస్త్రభూషణాదులతో గంధపుష్పాలు, అత్తరు, పన్నీరు, జవ్వాజి మొదలయినవి ఇప్పించి వారు దిగిఉండే పాళ్యానికి అంపించెను. తమవారికిన్ని వారివారికిన్ని వస్త్రములు గంధపుష్పాలున్ను ఇప్పించెను. అందరిని అంపించి తాను నగరిలో దాదివద్దికి భోజనానికి పోయెను. మరునాడు మొదలు పట్నాన ఉండగలవర్తకులు శీమవారు రాజుకు నజరు వస్త్రాలు

వింతవస్తువులు కానుకలు ఉంచి కనిపించుకొనిరి. పూర్వం విజయరాఘవనాయనినాడు జరిగిన మహాయుద్ధంలో స్త్రీబాలసహితంగా అందరు హతమయ్యేటప్పుడు అప్పటికి నిల్వ ఉన్న అనేకద్రవ్యం వరహాలు సాణారకాసులు, అనర్ఘ్యమయిన నవరత్నభూషణాలు గొప్పగొప్పబిందెలలో వేసి యినప పుత్తరాలు వుంచి బిందెలమూతులకు రేకులు అతికించి, స్త్రీలు ఉండే అంతఃపురాన యెవ్వరికీ తెలియకుండా భూస్థాపితం చేసిరి. ఆమర్మం దాదికిమాత్రం తెలుసును గనక దొరతోను వెంకన్నతోను చెప్పి తావు చూపించెను. అక్కడి రాళ్లు పెల్లగించి బిలం తెరిచి బిందెలు ఎత్తి చూచేటప్పటికి ఇరవైలక్షల వరహాలకు అయివేజున్ను, ఆరులక్షలవరహాలకు రత్నభూషణాదులున్ను లభించెను. దానిని యెత్తి భద్రపరిచి ఉంచుకొని, ఏకోజీరాజు వారివెంబడిసరదారులు, కార్యస్థులు, జమీందారులు, వీరికందరికిన్ని విందుచేసి చెంగమలదాసు రాజుకు లక్షవరహాలనగలున్ను, అందుకు తగినట్టు వస్త్రములున్ను, నాలుగు ఏనుగులున్ను, వెండిము స్తీదు, బంగారుము స్తీదు, చేసినగుర్రాలు ఎనిమిటిన్ని బహుమానమిచ్చెను. వారివెంబడి కార్యస్థులకు లక్షవరహాలకు నగలున్ను, వస్త్రములున్ను, పంచి యిచ్చెను. ఇదిగాక ఏకోజిరాజుకు సొంతానికి ఇనాముగా పదిహేనులక్షల రూపాయలు ఇచ్చెను. అతనిదివాన్ పేషువాయికి రెండులక్షల రూపాయలున్ను ఖానుడికి లక్షరూపాయలున్ను, నయిదుసాయి

బునకు లక్షరూపాయలున్ను ఆదినిమాట్లాడిన ప్రకారం యిచ్చె‌ను. పాళెమున వచ్చిఉండే గుఱ్ఱందళానికి అంతా ఒకనాటివిం‌దుకు సకలసామగ్రులున్ను ఇప్పించెను. పాచ్ఛాయికి నజరు‌పట్టకాణికసహా ఇరవైలక్షలరూపాయలున్ను, దరుబారుసెల‌వులకు అయిదులక్షలరూపాయలున్ను,ఇప్పించి బీజపురం బయ‌లుదేరిననాటినుంచి అంపకందినంవరకున్ను లెక్క చూచిఅయిన‌వ్రయం రూపాయలకు కుంభకోణంసుబా, మన్నారుకోవిలసుబా,‌పాపవినాశంసుబా; ఈమూడుసుబాలున్ను అడమానంచేసి వసూ‌లుచేసుకొనిపొమ్మని యేకోజినిదండును పయణంచేసి తాను వెం‌కన్న అయ్యంపేటవరకు వెంబడిపోయి తిరిగి తంజనగరం వచ్చి‌చేరిరి.ఏకోజీరాజు ఆరువేలగుఱ్ఱాన్ని పన్నెండువేలజనాన్ని మా‌త్రం తనవద్ద ఉంచుకొని కడమగుఱ్ఱం దళాన్ని పయణపరచి పా‌చ్ఛాయికియిచ్చిన నజరు పట్టకాణిక, దరుబారుసెలవు రూపాయ‌లుఇచ్చి నడిచిన సమాచారములన్ని వ్రాస్తూ దండుకరుచులకు‌సీమలో అడమానంచేసిన రూకలు వసూలుచేసికొని వస్తున్నా‌మని చెప్పి అంపించెను. తండ్రికిన్ని సమాచారం తెలియజేసెను.‌సుబాలకు రూపాయలు వసూలు చేయమని తాకీలు అంపించి‌తాను కుంభకోణాన దిగి ఉండెను. ఇట్లా ఉండగా, తంజాపూరి‌లో దళకర్తప్రధానికానికి నేమకంచేయవలెనని చెంగమలదాసుకు‌అందరు చెప్పగా, మంచిదని ఒకనాడు అందుకుకావలసినవస్త్రి‌భూషణాదులున్ను తాంబూలగంధపుష్పాదులున్ను తెప్పించి ప‌

సుగుహారాదా, నగారా, నవుబత్తు మొదలయిన వాద్యములు నగరి
వాకిట తయారుచేయించెను. వెంగన్న నిర్వాహకుడై ఇంతకా
ర్యమున్ను సాధించినవాడుగనుక, అతనికి ఇయ్యవలెనని అందరు
చెప్పిరి. నేను అతనికే ఈయవలెననిఉన్నాను. మాదాదితోకూ
డా ఒకమాట చెప్పి యిస్తానని, వెంగన్నను సన్నద్ధపరిచి తాను
నగరిలోపల దాదివద్దకుపోయి అడిగెను. ఆదాదికి సెట్టి వలపు
మగడు; అదిగాక నాగపట్నాన ఉండగా ఆతనితో తంజా
వూరు రాజ్యము ఈబిడ్డకువస్తే, నీకు దళకర్త ప్రధానికం ఇస్తు
న్నామని చెప్పివున్నది; ఈరెండు కారణాలచేత ఆసెట్టి వీరిని
మిక్కిలి ఆదరించెను. కనక ఈవుద్యోగం సెట్టికే యిప్పించవలె
నని పట్టుపట్టి దాది యిట్లు చెప్పెను. ఆసమయాన ఆదరించి,
మనను పన్నెండేళ్లు అన్నమిచ్చి రక్షించి బిజాపురం సెలవుకున్న
పరిశవణ సకలము స్తీదులు చేసియిచ్చి, నాటినుంచి మనవెంటనే
కాచిఉండే సెట్టికియ్యక మధ్య మనం నాగపట్నాన క్షేమము
తోఉన్న కబురువిని, వచ్చినబాపడికి యిచ్చేదా? ఆబ్రాహ్మడికి
కావలిస్తే సెట్టికింద, పేష్కారీకాని, సీమ అమలుగాని, ఇచ్చేది.
ఇంతేకాని, అధికారం సెట్టికి ఇవ్వవలసిందే. నేను ఆదిని దళక
ర్తప్రధానికం ఆయనకు ఇచ్చేమని కరారుచేసిఉన్నాను. సెట్టికే
ఇచ్చేదని వొత్తిచెప్పెను. చెంగమలదాసు పద్నాలుగేండ్ల పసి
బాలుడు. తలిదండ్రాదుల గురుతెరుగడు. బాల్యాదారభ్య ఆదా
ది తల్లివలె కొట్టి, తిట్టి పెంచింది. అటువంటి దాదిపట్ల భయ

భక్తివిశ్వాసంచేత, ఆమాట త్రోయగూడక తిరిగీ చదరకు వచ్చి, సెట్టిని పిలిపించి, వెంగన్నకు, యిచ్చేటందుకు తెప్పించిన వస్త్రభూషణములన్ని అతనికిఅలంకరించి దళకర్త ప్రధానకార్యానికి చేయించిన ఉంగరం, అతనిచేతికి వేసి, ఏనుగు హౌదాలో కూర్చుండబెట్టి పట్నం ప్రవేశం చేయించెను. సెట్టి పట్నమేగివచ్చి దొరకు బంగారుపూలు పాదాలలో వేసి, జోడు శాలువలు నివాళిచుట్టి సాష్టాంగముగా దండంపెట్టి లేవగానే, సకలమయినవారిని సెట్టియింటివరకు కూడాపొమ్మని, నేటిమొదలు అందరు సెట్టి వరెసప్రకారం నడుచుకొమ్మని చెంగమలదాసు ఆజ్ఞాపించెను. ఆప్రకారం అందరు సెట్టివెంబడి పోయిరిగాని వెంగన్నమాత్రం పోక ముఖం చిన్నపుచ్చుకొని యీయధికారం నాకియ్యకపోయినా వేరే ఒకబ్రాహ్మడికిగాని లేక నాయడికిగాని వెలమమొదలికిగాని ఇచ్చినా నాకుసమ్మతి; వారికింద ఉండి పనులు చూడవచ్చును. అదవిడిచి పుచ్చినవక్క అమ్మేసెట్టివానికి అధికారమిచ్చినారు. వానికింద ఉండి పనులుచేయడంకన్న నాలుగిళ్లు భిక్షమెత్తి జీవనముచేసేదిమేలు. వీరికై యిన్నాళ్లనుంచి పడిన ప్రయాసలు వ్యర్థమాయెను. ఇకను అంగడియ వీరివద్ద ఈకోటలోఉండేది విహితంకాదని నిశ్చయించుకొని ఆక్షణమే విడిదికివచ్చి తనసామాను ఎత్తించుకొని తనమనుష్యుల పిలుచుకొని పాలకీసవారిమీద కుంభకోణంవచ్చిచేరెను. చేరి పేష్వాయి, ఖానుడు, సయిదునాయబు, మొదలయిన కార్యస్థులను కని

మాట్లాడి మీరాజును వెఱ్ఱిఏమయినా కద్దా? ఇంతబుద్ధిమాలిన
రాజును ఎక్కడాచూచిందిలేదు. అదేమంటే, అతిరూపవతి,
విద్యావతి, సకలాభరణభూషితురాలు గావుండే పదహారేండ్లబా
ల్యప్రాయపుస్త్రీని అనుభవించక ఒకరిపార్శ్వాలో విడిచిపెట్టిపోవ
డం యెందైనా కద్దా? ఏమంటే, ఈచోళదేశం ఏడామడ విస్తార
ములో కోట్లద్రవ్యంఎత్తును. అదిగాక ఈకావేరినదితో ఊరూ
రికి ఇటువంటి పుణ్యస్థలములతో వొప్పుతూవుండే దేశమును
మీరెక్కడనయినా చూచిందికద్దా? ఈరాజ్యమున్ను, ఈకోట,
ఇటువంటి సామ్రాజ్యం విడిచిపెట్టి ఏల ఆకొండలరాజ్యానికిపోవ
లెను? అని చెప్పెను. చెప్పగానే వారికిఈమాటలు నిజమే అని
తోచెను. రాజువద్దికి పిలుచుకొనిపోయి తమతో చెప్పినప్రకారం
సమాచారములన్ని తామున్ను శ్రుతపరిచి వెంగన్నవాచానున్ను
చెప్పించిరి. ఏకోజీ ఆమాటలను "హరిహరి ఆపాపం మనకేల?
మనపాచ్ఛాయిఉత్తరువు ప్రకారం వచ్చి శత్రువులజయించి ఆపి
ల్లకాయకు పట్టంకట్టినాము. వారున్ను ఆదినిమాట్లాడినప్రకారం
తప్పకుండా నడిపించి మరిన్ని అధికముగ మనకు నడవగల మరి
యాదలు నడిపించినారు. రాజ్యానికి అర్హుడయిన దొరకొమా
రుడు మనపాచ్ఛాయివారి మహాసముఖాన బహుదినాలుకాచి
వుంటే మనమాదరం అభిమానించి సముఖానమనవిజేసి వారిఆజ్ఞ
తీసుకొనివచ్చి ధర్మంతప్పక యింతపని నడిపించినాము. ఇప్పుడు
ఈబ్రాహ్మడిమాటలు విని రాజ్యకాంక్షను లోబడితే అపకీర్తిన్ని

దోషమున్ను సంభవించేదేగాక పాచ్ఛాయితో విరోధంకూడా వచ్చును. మాతంత్రికిన్ని ఇంకా అచ్చటఉండే మావారికిన్ని హానివచ్చును. తెనుగువానిదొరతనానికి, మనంపుట్టినామా? ఇక మీాద యిటువంటిమాటలు మావద్దచెప్పవద్దని కోపగించుకోగా కార్యస్థులు వెంకన్న, ముఖంచిన్నపుచ్చుకొని బైటికివచ్చి వెంకన్నను నీవుజడియవద్దు. మారాజుకుదినాలపేరిటనే బోధించిపక్వ పరుస్తున్నాము. మాకందరికీ ఈపనిచేయవలెనని సమ్మతిగా ఉన్నది. ఇంకా సీమరూకలు అరుపుకాను అయిదారునెలలు పట్టును. ఆమీాద అవునుగాని, ఇంతలో పయణం లేదుగనుక వదరకుండాఉండి తలచినప్రకారం పనిచేసుకోవచ్చునని పేష్వాయిన్ని ఖానునున్ను, సయిదుసాయిబున్ను ధైర్యంచెప్పి ఉండమనిచెప్పిరి. ఏకోజికిన్ని దినాలపేరిట వారిబోధనలమీాద కొంచెంకొంచెం ఆరాజ్యాన్నిచూచి ఆశపుట్టుతూవచ్చెను. ఒకనాడు వెంకన్నను పిలిపించి "నీవైతే మాకార్యస్థులకు లేనిఆశలు పుట్టించి, వారుదినప్రతివచ్చి, మమ్ము పీడించేటట్టుచేసినావు. రాజ్యకాంక్షచేత అధర్మానికి లోబడినాగాని ఈదక్షిణాది మేమెన్నడు చూచినవారుగాము. మాకు ఈదేశంనెళవు తెలియదు. ఇదిగాక, తూర్పుసీమంతా మరవలుకట్టి శల్యంచేస్తున్నారు. పడమరనాటువారు కొల్లగొట్టుతారు. ఈమధ్యరాష్ట్రంలోమాత్రం మాగు ఆంజనంపోయి అక్కడక్కడ దిగి ఠాణాలుపెట్టినందుచేత శల్యంలేక రూకలు వసూలవుతున్నవి. సరిగా మాకువశపరుచుకోవడం

కిషం" అనగానే వెంకన్న మీరు కోటప్రవేశం అయిన యెని
మిదిదినాలలో చిక్కులన్నీతీర్చి ఆశల్యంచేసేవారంతా మీకాళ్ల
మీాద వచ్చిపడేటట్టుగా చేస్తున్నాను. అని వెంగన్న చెప్పిందివిని
రాజు నీవుచెప్పిందిసరే, పాద్షా మహాసత్యసంధుడు, ఈసంగతి
వారు వింటే మావారికిన్ని మాకున్ను ప్రాణాలకు వచ్చును.
గనుక మాతండ్రికి అంతరంగముందు వ్రాసిపంపించి తెలుసుకొని
ఆమీాద చెప్పుతున్నామని సెలవిచ్చెను. అంతట కొన్నిది
నములకు వెనుక ఆ పాద్షాయి పడిపోయెనని కాకితం వ
చ్చెను. రాజుకున్ను, కార్యస్థులకున్ను ఆభయాంతీరి మనస్సుకు
సమాధానమయ్యెను. కార్యస్థులు, రాజు కూడి మాట్లాడుకొని
వెంకన్నను రప్పించి నీఉద్దేశక్రమం సమయంవచ్చింది. అయితే
మనం యిదివరకు ఏమటినిజముంచి చెంగమలదాసుకు సకలవిభ
వముతో పట్టంకట్టించి ఉండినవారముగా ఉండి యిప్పుడు వారి
మీాదికి తిరిగి జగడంచేస్తే లోకానికి ఒప్పదు. రాజ్యకాంక్షచేత
అపకీర్తికి లోబడి జగడానికి ఆరంభంచేసినప్పటికీ తిరుచినాపల్లి
వారు వీరు బంధువులుగనుక పరులకు ఇమ్మియ్యగాదని వెనకటి
విరోధాలుమాపుచేసుకొని ఒకటిగాచేరి మనమీాద తిరుగబడ
వచ్చును. బహుదూరమునుంచి యెత్తివచ్చినవారము మేము,
వారుస్థలజ్ఞులు. కనుక నఖముఖాలవారూ ప్రవేశిస్తే దంమునిభా
యుంచేది ప్రయాసగాఉంమును. రాచకార్యంగదా! చిన్నపామైనా
పెద్దకట్టెతో కొట్టవలెగాని అల్పంగా ఎంచకూడదు. దీనికిమో

చాయేమని అడగగా వెంకన్న చెప్పినది:—అంతదూరం యోచ
న చేయవలసింది లేదు. అంతకంతా నేనుఉన్నాను. మీారుమాత్రం
దానుతీసుకొని అయ్యంపేటలో వచ్చేటగండి. కోట, అందులోఉం
డేసామగ్రి, సకలమున్ను నోటిమాటలో మీావశంచేసివేస్తున్నా
ను. నాసామర్థ్యంచూడండి. అనగానే రాజు బహుసంతోషపడి
వెంకన్నకు దుశ్శాలువలు, ముత్యాలహారంతో, నడిపతకముకూ
డా మెడనువేసి చేతికిరత్నాలతోడాలు, చెవికిపచ్చలు, ముత్యా
లపోగులువేసి నూరుగుఱ్ఱం వెంటయిచ్చి నిత్యం నూరురూపాయ
లబత్యం యేర్పాటుచేసెను. తానెక్కే గుఱ్ఱాలలో ఆను స్తీదుతో
రెండుగుఱ్ఱాలు బహుమానమిచ్చెను. అంతట మంచిలగ్నం ముందు
చూచుకొని, ప్రయాణభేరి వేయించి అయ్యంపేటలో పాళ్యం
దించినాడు. అక్కడ మకాముచేయగానే వెంకన్న తనవద్ద నమ్మి
కగా ఉండేవారిలో బుద్ధిమంతులుగా ఇద్దరిని పయనంచేయించి
కాకితం వ్రాసియిచ్చి తంజావూరు పంపెను. కాకితం యేమం
టే:—"రాజైతే ఏమో తెలియదు. మీామీాద బహుకోపంతో
వున్నారు. ఈవేళ మీారు ఎదటబడితే బహుమోసంవచ్చు
ను. నిమ్మళంమీాద రాజుమనసు దిద్ది నేను సమాధానపరచి
యథాప్రకారం కోట, రాజ్యం మీావశంచేసి అతను సాగిపొయ్యే
ట్టు చేస్తున్నాను, ఈవేళకుమాత్రం తప్పి తొలిగిఉంటే మం
చిదిగా నాబుద్ధికితోస్తున్నది. బ్రతికివుంటే శుభములు బడయ
వచ్చునని పూర్వీకులు చెప్పిఉన్నారు. నేను పారంపర్యముగా

తమవాణ్ణి గనుక ఇచ్చుట్ల. వీరి మనోభావం తెలిసి కాగితం వ్రాసినాను. ఆవల మీబుద్ధికి సరివచ్చినట్టు." అని వెంకన్న వ్రాసిన కాకితం తీసుకపోయి వారు చూపగానే, చెంగమలదాసు బాలుడు. స్వతహా ఏమీయెరగనివాడు, గనుక వెరచి గాబరాఅయి ప్రధానిసెట్టి ఆలోచనచేసెను. కోమటిపిరికి చెప్పవలసిందేమి! ఆతడు గడగడలాడుతూ స్వామీ! మోసంవచ్చెను. మరాటీవాళ్లను నమ్మరాదు. బైలుదేరవలెగాని ఇక ఉండకూడదని ఊదరయెత్తించెను. ఆరాత్రే సకలమున్ను విడిచిపెట్టి దాదితోను, సెట్టితోను, మిక్కిలిఇష్టుగా ఉండేజనాన్ని వేయింటికి పిలుచుకొని కొంత రొక్కమున్ను నగలున్ను ఎక్కుడుగుఱ్ఱాలమీదయెత్తుకొని గుఱ్ఱాలతో మూడుపల్లకులతో చెంగమలదాసు అరియలూరికి పోయెను. ఆసీమ తిరుచినాపల్లితో చేరిన పాళియపట్టు అక్కడ వుండను వెరుస్తూవుండగా ఆవూరిదొరరంగప్ప మళవరాయుడు తెలిసి యెదురుగా వచ్చి సకలానికినేను ఉన్నాను. చింతచేయవద్దని పిలుచుకొనిపోయి సకలమర్యాదలు జరిపి ఉంచుకొనెను. అక్కడ కోటవిడిచి చెంగమలదాసు పోయిన సమాచారం వెంకన్నకు తెలిసెను. తానుచేసినకృత్రిమం రాజుకు చెప్పిసంతోషపరచి రాజును తత్క్షణం పిలుచుకొనిపోయి కోటకు చేర్చెను. నాడుపోయిన కోటవాకిలి తమకు జయమిచ్చెనుగనుక దానికి "ఫత్తేదరువాజా" అని పేరుపెట్టిరి. పోయినవారు యెత్తుకపోయినదిపోను కొదవవున్న పురాతనబొక్కసం ఇంకా యితర

సామగ్రి ఏనుగులు, గుఱ్ఱములు, సకలమున్ను ఏకోజీవశం చేసు కొనెను. తానే చోళదేశానకు రాజై సీమకు తమమనుష్యుల నేమించెను. వెంకన్న మర్మజ్ఞుడుగనుక రెండువేలగుఱ్ఱమున్ను ఆఱువేలజనమున్ను తీసికొని సీమంతా జప్తిచేసి అక్కడక్కడ ఠాణ్యములు ఉంచి నయభయములమీద వశపరిచెను. చిల్లర పాళెగాండ్లమీద దండుదిగి వారికికవులిచ్చి వెంటపిలుచుకవచ్చి రాజు భేటీచేయించి మామూలుప్రకారం కానిక లిస్తూ రమ్మని చెప్పివొప్పించెను. ఈప్రకారం సకలమర్మములు వారికి చెప్పి అంతా బందోబస్తుచేసినతర్వాత, యేకోజి, పేష్వాయి మొద లయినకార్యస్థులు కూడి యోచనచేసినదేమనగా:— ఈవెంగ న్న ముందు చెంగమలదాసును వెంటతీసుకొని పాచ్ఛాయిదగ్గిరికి వచ్చి మనకుమ్మకుమీద యెవరిని జయించి ఆతనికి పట్టం కట్టించి నాడు. తిరిగి యిప్పుడు తనకు, అతనికి సరిపడకపోగా లేచివచ్చి మనకును యెసకొలిపి, చెంగమలదాసును పారిపొయ్యేటట్టు చే సి, రాజ్యం మనపరం చేసినాడు. ఇతడు బహుయుక్తిపరుడు. ఇక మనను పిండిబొమ్మలవలె ఆడిస్తాడు. అతను చెప్పినట్లు నడుచు కోవలెను. ఒకవేళ తనమనస్సుకు చక్కగా యెప్పుడైనా నడవక పోతే మనకూ యిదేగతి కలిగిస్తాడు. అందుకు సమర్థుడు. కనుక వీణ్ని పట్టి భద్రంచేయవలెనుగాని స్వతంత్రంగావుండనియ్యరాదు, ఈవిధంగా యోచనచేసినజాడ తెలిసి వెంగన్న అన్ని విడిచిపెట్టి తన అతితెలివికి, ఆనాసకు, ఫలం అదినదను కొంటూ ఒంటిగా,

భికారివేషంతో సీమవిడిచి పారిపోయెను. తిరుచినాపల్లెవారు పట్టి భద్రంచేసిరి. తర్వాత కొన్నాళ్ళకు విడిచిరి. కాని అతను వారివద్దనే వొదిగివుండెను. నాటిమొదలు తంజావూరురాజ్యం మహారాష్ట్రులు పాలిస్తూ వచ్చిరి. పారిపోయిన చెంగమలదాసు కొడుకు విజయరాఘవనాయుడు, ఆతనికొడుకు విజయమన్నారప్పనాయుడు. ఆతడు చొక్కనాధనాయనివారిమనుమడు విజయరంగచొక్కనాధనాయనివారికి తనచెల్లెలినిచ్చి వివాహం చేసి వారిచ్చినజాగీరు అనుభవిస్తూ వుండెను.

తంజావూరి యాంధ్రరాజులచరిత్ర

సంపూర్ణము.

---